

## సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె.వి. గోవిందరావు, బి.ఏ.,ఎల్ ఎల్.బి.
గౌరవ సహాయ సంపాదకులు :
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, ఎమ్.ఏ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఏ.,బి.ఎల్
సభ్యులు :
కె.వి.ఎస్. గోవిందరావు, బి.ఏ.,ఎల్ ఎల్.బి
కె.వి.ఎస్. శరత్‌బాబు, బి ఏ.,బి కామ్.,బి.ఎల్.
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి

## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందాలు పంపవలసిన చిరునామా :

**విస్‌డమ్**
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004

## విషయసూచిక

మార్చి 1984



★

ముఖచిత్రం: కలర్ ట్రాన్స్‌పరెన్సీ.
శ్రీ దిలీప్ బెనర్జీ, హౌరా, కలకత్తా.

**తెలుగు 'విస్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

## ధ్యానం

# భవిష్యత్తు ఎప్పుడూ బాగుంటుం దనే అనుకో!



జేమ్స్ ఎలెన్

ఎవరి లోపాలను వారు తెలుసుకోడం అవసరం. అందువల్ల క్రమంగా వాటిని అధిగమించి 'కర్తవ్య పాలన, నిస్స్వార్థ ప్రేమ' అనే పవిత్ర వాతావరణంలోకి వారు ఎదుగ గలుగుతారు. భవిష్యత్తును భయంకరంగా ఎప్పుడూ చిత్రించుకో రాదు. భవిష్యత్తును గురించి ఆలోచించే పక్షంలో అది మంచిదిగా ఉంటుం దనే ఊహించుకోవాలి. లోపాలను అధిగమించేందుకు ఉత్తమ మార్గం - స్వలాభాపేక్ష స్పర్శ లేని స్వ కర్తవ్య నిర్వహణ! ●

## సంపాదకుని పేజీ

# చెత్త పుస్తకాలు చేస్తున్న హాని



చాలా పుస్తకాల షాపులలో రంగు రంగుల అట్టలతో చౌకబారు చెత్త కామిక్ పుస్తకాలు కోకొల్లలుగా మనకు దర్శనం ఇస్తూ ఉంటాయి. కాలక్షేపం పేరుతో అవు రావురు మని అతి ఆత్రంగా మన పిల్లలు ఆ పుస్తకాలను చదువుతూ ఉంటారు. పరిణతి చెందని పిల్లల పసి మనస్సులను అలాంటి పుస్తకాలు

---

## పూర్తి విద్యుదీకరణ సాధించిన తొలి రాజస్థాన్ జిల్లా

రాజస్థాన్‌లో పూర్తి విద్యుదీకరణ సాధించిన తొలి జిల్లా 'సికార్'. ఆ జిల్లాలోని 839 గ్రామాలకూ ఇప్పుడు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతూంది.

---

"రాష్ట్ర సంకుచితత్వమనే బెరడుని తొలగిస్తే తప్ప అఖిల భారత మనే జాతీయతాభావాన్ని అందుకోలేము" - గాంధీజీ

ఎంత తేలికగా అవినీతి మార్గాలలోకి మళ్ళించగలవో మనలో చాలా మంది గుర్తించడం లేదు. పైకి అమాయికంగా కనిపించే ఈ కాలక్షేపం పుస్తకాలు కలిగిస్తున్న హానిని ఏ పత్రికా ఇంతవరకూ ఖండించక పోవడం ఆశ్చర్యకరం: ఏటేటా వేల సంఖ్యలో ఆ పుస్తకాలు చెల్లుతూనే ఉన్నాయి; పుస్తకాలు అద్దెకిచ్చే షాపుల ద్వారా, మారకం విధానం ద్వారా లక్షలాది పిల్లలు నిత్యం వాటిని చదువుతూనే ఉన్నారు.

పెరుగుదల సక్రమంగా లేని పిల్లలతో ఏళ్ళ తరబడి సతమతం అయిన ఒక సుప్రసిద్ధ మనోరోగ వైద్యుడు పిల్లలలో నేరప్రవృత్తి పెచ్చు పెరగడానికి ఈ కామిక్

## బొమ్మలలో హాస్యం

### పనిమనిషి ఇంట్లో టీ. వీ.

మన పనిమనిషి లచ్చమ్మ మాట్లాడుతోందండి!
వాళ్ళింట్లో ఈ రోజు టీవీ కొన్నార్ట
వచ్చి చూసి వెళ్ళమంటోంది!



---

## Statement about ownership and other particulars about newspaper "Wisdom", Madras-4.

(From IV See Rule 8)

1. *Place of publication* : Madras
2. *Periodicity of publication* : Monthly
3. *Printer's Name* : D. Sridhara Rao
   *Nationality* : Indian
   *Address* : Kranti Press, 2, Francis Joseph Street, Madras - 600 001.
4. *Editor's & Publisher's Name* : K.V. Govinda Rao
   *Nationality* : Indian
   *Address* : 9, Desika Road, Mylapore, Madras - 600 004.
5. *Name and address of individuals who own the newspaper and partners* : Wisdom Publications, 9, Desika Road, Mylapore, Madras - 600 004.

I, **K.V. Govinda Rao,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**(Sd. K.V. Govinda Rao,**
*Editor & Publisher,*
"WISDOM".

*Dated 1—3—84*
Madras – 600 004.

పుస్తకాలు ఎంతో దోహదం చేస్తున్నాయన్న నిర్ధారణకు వచ్చారు. కొందరు బాల మన శ్శాస్త్ర వేత్తలతో సహా చాలామందికి అసలు ఇలాంటి పుస్తకాలు ప్రచురించబడుతున్నట్టు కూడా తెలియదు.

ఈ చౌకబారు హాస్య పత్రికలలో పిల్లల మనస్సులను అంతగా ఆకట్టుకునే విషయాలు ఏమిటను కున్నారు? ఉద్రేకం కలిగించే సాహస కృత్యాలు! అలాంటివి పిల్లలలో తేలికగా ఆశ్చర్యం రేకెత్తించి, వారి మనస్సులను ఆకట్టుకో గలవని బాల మన శ్శాస్త్రజ్ఞుల అభిప్రాయం. మనుష్యుల్ని ఎత్తుకు పోయి, అడ్డం వచ్చిన వారి నల్లా తుపాకులతో కాల్చి చంపుతూ, విచ్చల విడిగా దారి దోపిడులు చేస్తూ, ఎప్పటి కప్పుడు పోలీసుల కన్ను గప్పి తప్పించుకుంటూ ఉండే—వారి దృష్టిలో, మహా ధైర్యశాలురైన—బంది పోటు దొంగలు వారికి ఆరాధ్య దైవా లవు తారు. అలాంటి కథలు పిల్లల మనస్సులను పూర్తిగా స్తంభింపజేసి, అట్టి సాహస కృత్యా లకు తామూ తలపడేట్టు ప్రోత్సహిస్తాయి. దొంగతనాలు చేసి జైల్లో పడ్డ తర్వాత గాని వారికి తెలిసి రాదు—అలాంటి సంఘటనలు వెండి తెరమీదా, అచ్చులోనూ మాత్రమే సాధ్యం కాగలవు అని! పిల్లలకు దొంగ తనాలు ఎలా చెయ్యాలో, అబద్ధాలు ఎలా చెప్పాలో, ఇళ్ళ తలుపులు బద్దలు కొట్టి ఎలా దోపిడీలు చెయ్యాలో బోధించే శిక్షణ శిబిరం ఒకటి ఎవరైనా నడుపదలచుకుంటే ఈ కామిక్ పుస్తకాలు అద్భుతమైన పాఠ్య గ్రంథాలుగా వారికి ఉపయోగిస్తాయి.

పిల్లల పెరుగుదల వారు తినే తిండిని బట్టి మాత్రమే కాదు, వారు చదివే పుస్తకాలను బట్టి ఉంటుంది!

## నీళ్ల మీద నడిచిన వ్యక్తి



ఉ. ప్రదేశ్‌లో మీర్జాపూర్ జిల్లాకు చెందిన శ్రీ ద్వారకా ప్రసాద్ చౌరాసియా రెక్సిన్‌తో కప్పిన 'థెర్మోకోల్' దిమ్మలను కాళ్ళకు కట్టుకొని, అడుగున గుండ్రని థెర్మోకోల్ దిమ్మలు అమర్చిన రెండు అయిదేసి అడు గుల గడ కర్రలను రెండు చేతులతో పట్టు కొని నీళ్ళ మీద నడుస్తున్నాడు. కర్రలు బాలెన్స్ నిలుపడానికే కాక, ముందుకూ వెనక్కూ పోవడానికి కూడ ఉపయోగిస్తాయి. 'థెర్మోకోల్' నీళ్ళ మీద తేలే ఒక తేలిక పదార్థం. ఇంతకు ముందు చౌరాసియా నేల మీదా, నీళ్ళలోనూ కూడా నడిచే సైకిల్ తయారు చేశాడు

"మనం చెప్పే మాటలు ఎవరూ నమ్మరు:
మన చేతలే అందరూ గమనిస్తారు." —జవహర్‌లాల్ నెహ్రూ

# కష్టాలను అధిగమించడం ఎలా?

డా॥ క్లైవ్ డి. హర్లీ

''నా కష్టాలు పగవారికి కూడా వద్దు!బాబూ!'' అని తరుచు మనం అంటూ ఉంటాం. ఇతరుల కష్టాల కంటె మరీ దగ్గిరగా మన కష్టాలు కనిపిస్తూ ఉండడం వల్ల, వాళ్ళందరి కష్టాల కంటె ఇవి చాలా దారుణమైన వని మనం అనుకుంటాం.

నిజానికి - ఏ ఇద్దరు మనుష్యుల మధ్య అయినా కనిపించే తేడా వాళ్ళు అనుభవించే కష్టాల పరిమాణంలో కాదు; ఆ కష్టాలను వారు ఎదుర్కొనే తీరు వల్లనే వారు తేడాగా కనిపిస్తారు. తనకు ఎదురైన కష్టాలనూ, నిరాశలనూ, చికాకులనూ, చిక్కులనూ ఎదుర్కొనే తీరులోనే మనిషి నిజమైన యోగ్యత, సౌశీల్యం వెల్లడి అవుతాయి.

ఒక పద్ధతి ఏమిటంటే - 'నా కర్మ ఇలా వ్రాసిపెట్టి ఉంది' అని సరిపుచ్చుకోడం. కాని ఉదాత్తుడైన మానవుడికి ఇది ఉచితం కాదు. మరో పద్ధతి: తనకు అన్యాయం అనిపిస్తున్న ఆ పరిస్థితుల మీద తిరగబడడం. జీవితం మీదే అనంతమైన అక్కసు పెంచుకోడం. దీనివల్ల వ్యక్తిత్వం కుంచించుకు పోయి, స్వభావంలో కాఠిన్యం, చిరాకూ ఎక్కువ అవుతాయి. మూడో పద్ధతి - పలాయనం, పారిపోవడం: మన కష్టాల బరువును ఇతరుల నెత్తి మీదికి ఎత్తడం ద్వారా గాని, చేతు లెత్తేసి నిస్పృహ యత ప్రకటించడం ద్వారా గాని సమస్య నుంచి తప్పించుకోవా లని మనం చూస్తాం. అయితే - జీవితానికీ, దాని సవాళ్ళకూ పిరికితనం సరియైన సమాధానం కాదు. దానివల్ల

## 'గ్రావిటీ ఇన్వర్షన్' బూట్లు



లోపల ఫోమ్ ఉన్న ఈ ఇనుప బూట్లు ధరించి రోజూ కొద్ది నిముషాల పాటు తల్ల క్రిందులుగా వ్రేలాడితే ఆందోళన, అలజడి, వెన్ను నొప్పి మొదలయినవి తగ్గ గల వని కాలిఫోర్నియా నుంచి డా. రాబర్ట్ మార్టిన్ ప్రకటిస్తున్నారు. భూమ్యాకర్షణ వల్ల శరీరం లోని ధాతువులు నిత్యం క్రింది వైపుకు గుంజబడుతూ ఉంటా యనీ, ఆ ప్రక్రియను తారుమారు చేయడానికి ఈ బూట్లు తోడ్పడ గల వనీ ఆయన అన్నారు.

''లోకంలో ఉన్న 'చీకటి' అంతా ఏకమైనా
ఒక చిన్న కొవ్వొత్తి ముందు నిలబడలేదు.'' —విన్ రోడ్

మన ప్రవర్తనలో వక్రత ఏర్పడడం, దార్ఢ్యం లోపించడం, ఆత్మగౌరవం తగ్గడం జరుగుతాయి.

వీటన్నిటి కంటె ప్రశస్తమైన మరో విధానం ఉంది. మన పురోగతికి సాధనంగా మన కష్టాలను మనం ఉపయోగించుకోవచ్చును. 'సాహసం' వంటి ఉదాత్త గుణాలను ప్రకటించేందుకు అవకాశంగా వాటిని మలచుకోవచ్చును. కష్టాలనుంచి నూతన విజయాల సాధనకు ప్రేరణను పొందవచ్చును.

ప్రాచీన కాలంలో గ్రీస్ దేశంలో 'డెమోస్తనీజ్' అనే యువకుడు ఉండేవాడు. అతనికి బ్రహ్మాండమైన నత్తి. పాపం, ఒక్క వాక్యం తడబడకుండా సరిగ్గా మాట్లాడ లేక పోయేవాడు. తోటివారు అతణ్ణి చూసి నవ్వేవారు. ఇంకొక రెవరైనా అయితే అలాంటి పరిస్థితులలో 'ఆత్మ దయ' (self-pity) తో క్రుంగిపోయి ఉండేవారు. అలా కాకుండా అతడు ఒంటరిగా సముద్రపు ఒడ్డుకు వెళ్ళి నోటినిండా గులకరాళ్ళు పోసుకుని నిదానంగా 'నత్తి' లేకుండా స్పష్టంగా మాట్లాడడం అభ్యాసం చేశాడు. చివరికి - గ్రీస్ దేశంలో సాటిలేని మహోపన్యాసకుడుగా అతడు ప్రసిద్ధి పొందాడు.

ఇటీవలి కాలంలో ఆ విషయంలో చెప్పుకోదగిన వ్యక్తి జగత్ ప్రసిద్ధురాలైన హెలెన్ కెల్లర్ గురువు ఆనీ సుల్లివాన్. ఆమె పుట్టు గుడ్డి. తన 8 వ ఏటనే తల్లిని కోల్పోయింది. తండ్రి ఆమె సంగతి పట్టించుకో లేదు. ఒక 'వర్క్ హౌస్' లో ఆమె పెరిగింది. అదృష్ట వశాత్తు వారు ఆమెను 'అంధుల పాఠశాల'కు పంపారు. అక్కడ ఆమె బ్రెయిలీ లిపి నేర్చుకుంది. తరువాతి కాలంలో గుడ్డి—చెవుడు—మూగ, అయిన ఏడేళ్ళ హెలెన్ కెల్లర్‌కి నర్స్‌గా ఆమెను నియమించారు. చిన్నతనంలో కెల్లర్ అదుపాజ్ఞలు లేకుండా తెగ అల్లరి చేస్తూ, అందరినీ ఎదిరిస్తూ ఉండేది. తల్లిదండ్రులే 'ఇంచుమించు మూఢురాలు', (near-idiot) అని ఆమె విషయంలో నిర్ణయానికి వచ్చారు. డా. శామ్యు

## మిక్కిలి వేగంగా పోయే రైలు



1981 ఫిబ్రవరి 26న ఫ్రాన్స్‌లోని టి.జి.వి. ఒక రైలును గంటకు 380 కి.మీ.ల వేగంతో నడిపి కొత్త రికార్డును స్థాపించింది. అయితే - ప్రస్తుతం 270 కి.మీ. ల కంటె ఎక్కువ వేగంగా తమ రైళ్ళు నడువరా దని నిషేధించారు. రెండు ఇంజన్‌లూ, మధ్యలో 8 పెట్టెలూ ఉండే ఈ రైళ్ళలో ఎయిర్ కండిషనింగ్, ధ్వని నివారక సౌకర్యాలూ (sound proofing) ఉండడం వల్ల తడవకు 386 గురు ప్రయాణికులు వీటిలో సుఖంగా ప్రయాణం చేయగలుగుతున్నారు.

"సంపదలు కూడ బెట్టడమనే విద్యకు, వితరణ బుద్ధితో వెచ్చించగల లక్షణం లేకపోతే, దానంత క్షుద్రమూ, నీచమూ మరొకటి లేదు" -గాంధీ

యెల్ హోవె 'చెవుడు-గుడ్డి' అయిన లారా బ్రిడ్జ్‌మన్‌కి ఎలా విద్యాబోధన చేసిందీ వివరించే గ్రంథాన్ని ఆనీ చదివింది. అదే ప్రక్రియలో కెల్లర్‌కి ఆమె విద్యాబోధ చేసింది.

హెలెన్ కెల్లర్ కథ జగత్ ప్రసిద్ధమైంది. చెవుడు, గుడ్డి ఇంచుమించు మూగ అయిన ఆమె ఎలా యూనివర్సిటీలో పట్టభద్రురాలైందీ, ఆధునిక యుగంలో మానవ విమోచనం కోసం, ప్రగతి కోసం ఎంత ఉత్సాహంగా ఆమె పాటు పడిందీ అందరికీ తెలుసు. కాని, దారుణమైన అంగవైకల్యంతో బయటి ప్రపంచంతో ఎలాంటి సంబంధం లేని ఆ బాలికకు ఆశ. ధైర్యం, పట్టుదల, సంతోషాల తలుపులు తెరచిన ఆనీ సుల్లివన్‌ను గురించి ఎక్కువ మందికి తెలియదు. తన విద్యార్థిని జీవితం కంటె ఆనీ సుల్లివన్ జీవితం మరింత సాహసంతో కూడింది. అంగవైకల్యాలను అధిగమించడంలో మానవాతీతమైన ప్రజ్ఞకూ, తన బరువులనూ, కష్టాలనే తన విజయానికి నిచ్చెన మెట్లుగా మార్చుకునే అద్భుతమైన నైపుణికీ ఆమె జీవితం గొప్ప నిదర్శనం?

తీవ్రమైన తన అంగవైకల్యాల వల్లనే, చిన్ననాడు తను అనుభవించిన కష్టాలవల్లనే అలాంటి మరో వ్యక్తి పరిస్థితిని సూక్ష్మంగా అవగాహన చేసుకోగల శక్తి ఆమెకు అలవడింది. ఒక వ్యక్తి జీవితంలో వెలుగు ప్రసరింప చేయడం అనే అక్షరాలా అసంభవమైన కార్యాన్ని తన ఓర్పుతోనూ, ధైర్యంతోనూ ఆమె సాధించ గలిగింది.

ఆనీ మాటలలోనే ఆమె విజయానికి

కీలకం ఈ సూత్రం: "ఫలితం ఎలా ఉన్నా ప్రారంభించడం మానకండి: ఒకసారి ఓడి పోతే, మళ్ళీ మొదలు పెట్టండి. దానివల్ల మీ బలం పెరుగుతుంది. చివరికి లక్ష్యం సాధి స్తారు. అలా సాధించిన లక్ష్యం ఒక్కొక్క ప్పుడు మనం ఉద్దేశించింది కాకపోవచ్చును; కాని, ఆనందంగా మనం దాన్ని జ్ఞాపకం పెట్టుకుంటాం."

సుప్రసిద్ధ మనశ్శాస్త్రవేత్త డా. ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్ ప్రతిపాదించిన ప్రధాన సూత్రాలలో ఒకటి: తమ అసక్తలనూ, నిరాశలనే ముడి సరుకుగా ఉపయోగించి ఘన విజయాలను సాధించే శక్తి, ఋణాంకాన్ని ధనాంకంగా మార్చే శక్తి మనిషిలో స్వతస్సిద్ధంగా ఉంది అని. "మనలో లోపాలే మనకు అదృష్టంగా పరిణమిస్తాయి. కష్టనష్టాలూ, నిరాశలూ, ఓట ములూ ఎన్నడూ రుచి చూపి ఉండని వారి కంటె ఎన్నో ఇక్కట్లను ఎదుర్కొన్నవారే జీవితంలో మరింత పైకి వస్తారు" అంటారు ఆయన:

మీ చుట్టూ ఉన్న మిత్రులనూ, పరిచయస్థు లనూ జాగ్రత్తగా గమనించండి. వారిలో ఎక్కువగా ఆకర్షించే బలమైన వ్యక్తిత్వం గలవా రెవరో ఆలోచించండి. అలాంటి వారిలో ప్రతి ఒక్కరూ ఎన్నెన్నో కష్టాలు పడ్డవారూ, నిరాశనూ, ప్రతిబంధకాలనూ ఎదిరించి నిలబడ్డవారూ అయి ఉంటారు. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నప్పటికీ కాదు, ఆ ప్రతికూల పరిస్థితుల వల్లనే వారు విజయం సాధించా రని మీరు గుర్తించ గలుగుతారు.

మరో విశేషం కూడా ఉంది. భయంతో కప్పించుకొని పారిపోజూచి నప్పటి కంటె ధైర్యంగా మనం ఎదుర్కొన్నప్పుడు మన కష్టాలు మనకు మరింత తక్కువ బాధాకరంగా కనిపిస్తాయి. 'బాలనాగమ్మ కథ'లాంటి మన జానపథ కథ లన్నింటిలోనూ మాయల మరా ఠీకో, మరో రాక్షసుడికో భయపడకుండా కథానాయకుడు వారిని ఎదిరించిన కొద్దీ క్రమంగా వారి బలం సన్నగిల్లుతూ వస్తుంది. అలాంటి కథలు తర తరాలుగా ఒక జాతి గడించిన విజ్ఞానానికి నిధానాలు భయాలనూ, బాధలనూ ధైర్యంగా ఎదుర్కోడంవల్ల వాటి తీవ్రత తగ్గుతుం దనీ, అలా ఎదుర్కొనే వ్యక్తి బలం పెరుగుతూ వస్తుం దనీ మానవ నాడో గుర్తించిం దనడానికి రాక్షసుల

(మిగతా 60 వ పేజీలో)

## పొగత్రాగడంవల్ల అనర్థాలు




అమెరికాలోని 'నేషనల్ సెంటర్ ఫర్ హెల్త్ స్టాటిస్టిక్స్' 1979 సం.కి ప్రకటించిన రికార్డుల ప్రకారం పనికి నాగాపెట్టేవారు పొగ త్రాగని వారిలో కంటె పొగ త్రాగే వారిలో 47.4 శాతం ఎక్కువ.

"సాయం చేసే మంచి మనస్సుకు విమర్శించే హక్కు ఉంటుంది." —అబ్రహాం లింకన్

# భారత యోగులు

## భగవా ్ర బాలయోగి

పి. ఎల్. సుబ్రహ్మణ్య

ప్రతి ఏడూ మహా శివరాత్రి వెళ్ళిన మర్నాడు తూర్పు గోదావరి జిల్లాలోని ముమ్మిడివరం గ్రామం భగవాన్ శ్రీ బాలయోగి సందర్శనానికి వచ్చే లక్షలాది భక్తులతో కిట కిట లాడిపోతుంది. గత 37 ఏళ్ళుగా- 1946 జూన్ 22 నుంచీ- బాలయోగి ఉగ్ర తపస్సు కొనసాగిస్తున్న పుణ్యస్థలం ముమ్మిడివరం. నిరంతరం ఆనంద మయుడైన పరబ్రహ్మ యందు జీవించే ఆ మహా యోగి ఉనికి వల్ల ఆ ప్రాంతం ఇప్పుడు పవిత్రతతో, అపూర్వ సౌందర్యంతో కలకల లాడుతూంది.



తూర్పు గోదావరి జిల్లాలో అమలాపురం తాలూకాలోని ఒక కుగ్రామం ముమ్మిడివరం. ఊరికి దూరంగా ఉండే హరిజన వాడలో శ్రీ కటికాతల గంగయ్య, శ్రీమతి రాముమ్మ అనే హరిజన పుణ్య దంపతుల మూడవ బిడ్డగా 1930 అక్టోబరు 23న బాలయోగి జన్మించారు. ఈయనకు తల్లి దండ్రులు పెట్టిన పేరు సుబ్బారావు.

గొళ్ళ కులానికి చెందిన ముగ్గురు భూస్వాముల వద్ద 5 ఏళ్ళ పాటు గొడ్ల కాపరి కుర్రాడుగా సుబ్బారావు పని చేశాడు.

ఒక శనివారం (22-6-1916) నాడు ప్రొద్దున నిద్ర లేస్తూనే ఎంతో ఆనందంగా కనిపించాడు సుబ్బారావు. ఒక శ్రీకృష్ణుని ఫొటో, ఒక నారదుని ఫొటో చేత పుచ్చుకుని తిన్నగా తమ ఇంటికి దక్షిణంగా ఉన్న కొబ్బరి తోటలోకి వెళ్ళా

### హెక్టేర్‌కి 6 టన్నుల వరి పంట

అగ్ని పర్వతాలతో కూడిన ఒక చిన్న ద్వీపం అయిన జపాన్ ఏటా సగటున హెక్టేర్‌కి 6 టన్నుల వరి పంట పండిస్తూంది. ఇండియాలో సగటు దిగుబడి 1.8 టన్నులు మాత్రమే।

“ప్రపంచ చరిత్ర మహాపురుషుల చరిత్రే। -థామస్ కారల్

డు. ఒక కొబ్బరి చెట్టు క్రింద ఆ ఫొటోలను చెట్టు మొదలు కానించి నిలబెట్టి ఉత్తర ముఖంగా కూర్చుని తపస్సు ప్రారంభిం చాడు. సరిగ్గా అప్పుడే సూర్యోదయం అవు తూంది

ఉదయం 10 గం.లకు గాని తల్లి దండ్రు లకు అతని జాడ తెలియలేదు. వారు ఆదు ర్దాగా పరుగెత్తుకు వచ్చి బ్రతిమిలాడి, బామాడి లాభం లేకపోగా, చివరికి బలవంతాన అతణ్ణి ఇంటికి తీసుకు వెళ్ళారు. ఇంటికి వెళ్ళిన తరువాత కూడా అరుగు మీద కూర్చుని కళ్ళు మూసుకుని అతడు తన తపస్సు సాగిస్తూనే ఉన్నాడు. ఆ విధంగా 16 వ ఏటనే యోగి అయినందున అందరూ ఆయనను 'బాల యోగి' అన్నారు. చివరికి ఆ పేరే స్థిరపడి పోయింది. కుల, మత వివక్షణ లేకుండా వందలాది జనం రోజూ ఆ హరిజన పేటకు వచ్చి బాలయోగి దర్శనం చేసుకోసాగారు. ఆ తరువాత కొన్నాళ్ళకు శ్రీ గంగయ్యే హరి జన పేట చేరువలోని ఒక పోరంబోకు భూమిలో అతని కోసం ప్రత్యేకంగా ఒక చిన్న కుటీరం నిర్మించారు.

సమాధి స్థితిలోనే ఉంటూ ఎప్పుడు ఎలా బాలయోగి ఆ కుటీరంలోకి వచ్చాడో ఎవ్వరికీ తెలియదు. అక్కడ పద్మాసనం వేసుకుని తపస్సు కొనసాగిస్తున్నాడు. ఎండనక, వాననక తీర్థప్రజగా జనం వచ్చేవారు. ఉన్న ట్టుండి ముమ్మిడివరం మహాక్షేత్రం అయి పోయింది. వచ్చిన భక్తులు అర్పించిన దక్షిణ లతో ఆ హరిజన దంపతులు బాలయోగికి పక్కా మందిరం కట్టించారు. వెనుకటి లాగానే ఎవ్వరికీ తెలియకుండా బాలయోగి ఆ మందిరంలో ఆయన కూర్చోడానికి నిర్మించిన వేదిక మీద ప్రత్యక్షం అయారు. 'యోగ సమాధి' కొనసాగుతూనే ఉంది.

1949 ఫిబ్రవరి 6 న కాకినాడ పట్టణ వాస్తవ్యులు శ్రీ వ్యాసం సత్తిరాజు బాల యోగి సందర్శనానికి వచ్చారు. ఆ సత్తి రాజు పూర్వజన్మ సుకృతం వల్ల బాలయోగి కళ్ళు తెరచి ఆయనతో మాట్లాడారు. మళ్ళీ 1949 ఫిబ్రవరి 10 న మరో ఇరువురు

---

## ప్రపంచ స్థాయి భారత క్రీడాకారుడు



ప్రపంచ స్థాయి ప్రావీణ్యం సాధించిన భారతీయ క్రీడాకారుడు ఇప్పటివరకు మిల్కా సింగ్ ఒక్కడే ఉన్నాడు. 1958 లో టోకి యోలో జరిగిన ఆసియా క్రీడోత్సవాలలో 400 మీ. ల దూరాన్ని 46.6 సెకనులలోనే ఆయన పరుగెత్తారు. 200 మీ.లు, 400 మీ. ల పోటీలలో ఆసియాలో ఆయన క్రొత్త రికార్డు స్థాపించారు. అదే ఏడాది కార్డిఫ్‌లో జరిగిన కామన్వెల్త్ క్రీడలలో బంగారు పతకం సాధించిన తొలి భారతీయ క్రీడా కారుడు మిల్కాసింగ్!

పుణ్యాత్ములతో ఆయన ఇలా చెప్పారు: "నా తపస్సు చరమ దశకు వచ్చింది. ఇదే నాకు ఆఖరి జన్మ. చాలా ఉగ్రమైన తపస్సుకి ఇప్పుడు నేను ఉపక్రమిస్తున్నాను. త్వరలోనే సిద్ధి కలుగుతుంది. మందిరం తలుపులు బంధించి తాళం వేసి, ఎవ్వరూ నా తపస్సుకు విఘ్నం కలిగించకుండా చూడండి!"

ఆ ఇరువురు పుణ్యాత్ములూ 'ఏడాది కొక సారి అయినా భక్తులకు దర్శనం అనుగ్రహించ వలసిం'దని ప్రార్థించగా అందుకు ఆయన అంగీకరించారు. ప్రతి ఏడూ శివరాత్రి వెళ్ళిన మర్నాడు ఒక్క రోజు మాత్రం మందిరం తెరవడానికి ఆయన ఒప్పుకున్నారు.

1949 మార్చి 27న కొందరు భక్తులు బాలయోగి తపస్సు చేస్తున్న కుటీరానికి పెంకుటి కప్పు వేయించడానికి వచ్చారు. వారు ఆయనను కలుసుకొని కొన్నాళ్ళు రోజూ భక్తులకు దర్శనం ఇవ్వవలసిం దని కోరారు. ఉదయం 4 గం.లు మొదలు 6 గం. ల దాకా కొద్ది రోజుల పాటు రోజూ ఆయన దర్శనం ఇచ్చారు. వారు అడిగిన కొన్ని ప్రశ్నలకు కూడా బాలయోగి జవాబు చెప్పారు. అదే ఆయన ఆఖరు సారి మాట్లాడడం.

ఆ తరువాత నేటి వరకూ ఆయన ఎవ్వరితోనూ మాట్లాడింది లేదు. శివరాత్రి వెళ్ళిన మర్నాడు ఇచ్చే దర్శనం సందర్భంలో మాత్రం బాలయోగి కళ్ళు తెరచి కమిటీ సభ్యులతో కేవలం సంజ్ఞలతోనే ప్రసంగిస్తారు. దానిని బట్టి కొన్ని ఏళ్ళుగా ఆయన మౌన వ్రతం పాటిస్తున్నట్లు అర్థం అవుతూంది.

ముమ్మిడివరంలో ఆ విధంగా ఉగ్ర తపస్సు చేస్తున్న బాలయోగి ఆకలి, దప్పికలను జయించారు. ఆహారంతో, నీటితో, గాలితో ఆయనకు పని లేదు. శివరాత్రి వెళ్ళిన మర్నాడు ఒక్కరోజు 20 గంటలపాటు మౌనంగా భక్తులకు దర్శనం ఇస్తున్నారు.

ఈ ఏడు దర్శనం 1984 మార్చి 1న తెల్లవారు జాము 4 గం. లు మొదలు రాత్రి 12 గంటల వరకూ జరుగుతుంది. బాలయోగి ఆశ్రమంలో వెలసిన ఎన్నెన్నో భవనాలూ, గోపురాలూ పవిత్ర వాతావరణాన్ని సృష్టించి, ఆయన దర్శనానికి వచ్చే లక్షలాది భక్తుల మనస్సులను భగవంతునివైపు మళ్ళిస్తున్నాయి. ●

---

## ప్రముఖ క్రికెట్ ఆల్‌రౌండర్ లలో గణనకెక్కిన కపిల్‌దేవ్



ప్రస్తుతం 24 ఏళ్ళ వయస్సులో ఉన్న క్రికెటర్ కపిల్‌దేవ్ మిక్కిలి చిన్న వయస్సులోనే 1,500 పరుగులూ, 150 వికెట్లూ సాధించారు. ఒక్క సంవత్సరం (1979) లోనే ఆయన 74 టెస్ట్ వికెట్లు తీసుకున్నారు. 1981 లో డెన్నిస్ లిల్లీ దానిని అధిగమించేవరకూ అదే ప్రపంచ రికార్డు!

"హృదయం తాలూకు జ్ఞాపకశక్తి 'కృతజ్ఞత'!" —జె. బి. మరియూ

# పరిశోధనలు

## మిక్కిలి పెద్ద కమ్యూనికేషన్స్ శాటిలైట్:

1984 లో అరియాన్ రాకెట్ ద్వారా యూరప్ అంతటిలోకీ మిక్కిలి పెద్ద 'కమ్యూనికేషన్ శాటిలైట్'ను భూమి కక్ష్యలోకి ప్రవేశపెట్టే సన్నాహాలు జరుగుతున్నాయి. దీనిలో రెండు టీ.వీ. రిలే సౌకర్యాలూ, అనేక 'భోగట్టా అనుబంధాలూ' (data links) ఉంటాయి. ఏక కాలంలో బ్రిటన్ అంత ప్రాంతంలో 10 టీ. వీ. ఛానెల్స్ పని చెయ్యడానికి కావలసినంత శక్తిని ఇది ఉత్పత్తి చేయగలదు. దాదాపు 70,000 టెలిఫోన్ సంభాషణలను ఏక కాలంలో అది ప్రసారం చేస్తుంది.

* * *

## టెలిఫోన్ తీగెల ద్వారా ఉత్తరాల బట్వాడా:

అమెరికాలో పోస్టు ద్వారా ప్రస్తుతం బట్వాడా అవుతున్న ఉత్తరాలలో 4/5 వ వంతు రాబోయే కొద్ది సంవత్సరాలలో టెలిఫోన్ తీగల ద్వారా బట్వాడా అయే స్థితి వస్తుంది. 'కంప్యూటరైజ్' చేసిన టైప్ మెషీన్ మీద తను పంపదలుచుకున్న ఉత్తరం టైప్ చేసి, చిరునామాదారు టెలిఫోన్ నెంబరు డయల్ చేస్తే చాలు. వెంటనే టెలిఫోన్ తీగెల ద్వారా ఆ ఉత్తరం ప్రసారమై రెండో కొసను టైప్‌రైటర్ మీద టైప్ చేయబడుతుంది. మరో పద్ధతి - ఉత్తరం చేతితో వ్రాయడం గాని, మామూలు టైప్ మెషీన్ మిద టైప్ చేయడం గాని జరిగితే, దానిని ఫాక్స్‌మిలీ యంత్రంలో పెట్టి, చిరునామాదారు టెలిఫోన్ నంబర్ డయల్ చెయ్యాలి. ఒక నిముషం తరువాత చిరునామాదారు

(మిగతా 56 వ పేజీలో)

## ఆనకట్టల నిర్మాణంలో ఇండియా ముందంజ



ప్రపంచంలో పెద్ద పెద్ద ఆనకట్టలు ఎక్కువగా నిర్మించిన ప్రపంచ దేశాలలో నేడు ఇండియా ఒకటి. 1,554 పెద్ద ఆనకట్టలూ, మరెన్నో చిన్నవీ, మీడియమ్ సైజువీ మనకు ఉన్నాయి. వీటి నిర్మాణానికి సుమారు రూ. 10,000 కోట్లు ఖర్చయింది. మరో 200 జలవిద్యుత్ పథకాలు ఇంకా నిర్మాణం పూర్తి కానివి ఉన్నాయి.

"ధైర్యే సాహసే లక్ష్మీః." —సంస్కృత సూక్తి

# ఆరోగ్యానికి మూలికలు

## పసుపు మొక్క ఉపయోగాలు

డా॥ పి. జె. తోట్టమ్

ఇవాళ ఆంటీ బయోటిక్ మందులు ఎన్నో వస్తున్నాయి. అయినా—కలరా వ్యాధికి చికిత్స చెయ్యాలంటే డాక్టర్లకు ఇప్పటికీ గుండె బెదురే! అయితే—కలరాకు ఆయుర్వే



BERBERIS LYCIUM

దంలో ఒక అమోఘమైన మందుంది. ఇప్పుడిప్పుడే అల్లోపతీ వైద్య పరిశోధకుల దృష్టిని కూడా అది ఆకర్షిస్తూంది. అది కస్తూరి పసుపు.

తమిళనాడులోని నీలగిరి కొండలలోనూ, ఇండియాలోని అన్ని సమశీతోష్ణ ప్రాంతాల లోనూ పసుపు మొక్కలు బాగా ఎదుగు తాయి. పసుపు మొక్క (బెర్బెరిస్-berberis) లో ఎన్నో రకాలు: బెర్బెరిస్ అరిస్టాటా, బెర్బెరిస్ ఆసియాటికా, బెర్బెరిస్ లైసియమ్ వంటివి. ఇవన్నీ 'బెర్బెరిడేసియే' అనే వృక్ష కుటుంబానికి చెందినవి.

### మీరైతే?



("నిర్జనంగా ఉన్న రోడ్డుమీద డజను కుక్కలు వెంట పడితే?")

"పది మంది అప్పులోళ్ళు తరుముకొస్తే
తప్పించుకున్నా! నాకు కుక్క లొక లెక్కా?
—జి. బాబురావు, వడిశలేరు.

* * *

"నా ప్రాణానికి ఒక్కటి చాలదా?
డజను కుక్కలు ఎందుకు స్వామీ!"
—మట్టా అప్పలస్వామి, దేవాది.

* * *

"మొన్న వరదలకు మా ఊళ్ళో
ఊరకుక్కలన్నీ చచ్చిపోయాయిగా!"
—ఆర్. సత్యనారాయణ, సూరప్ప గూడెం.

"నిజంగా చావు లేదనడానికి మొలిచే
క్రొత్త అంకురం ఒక నిదర్శనం!" —వాల్ట్ విట్మన్

బెర్బెరిస్ అరిస్టాటాకు వివిధ ఇండియన్ భాషలలో పేర్లు: తెలుగు—కస్తూరి పసుపు; హిందీ—రసౌత్; తమిళ, మలయాళాలు—మర మంజళ్; బెంగాలీ—దర్ హోల్దీ; కన్నడ—దొడ్డమర దరిపిన; మరాఠీ—దర్ హాలద్; పంజాబీ—సున్‌లూ; ఇంగ్లీషు—ట్యూమరిక్ (tumeric).

ఈ మొక్క తాలూకు దుంపల పై బెరడూ, మొదలూ, పళ్ళూ వైద్యానికి ఉపయోగ పడుతాయి.

ప్రొ. ఖార్, ఆయన సహచరులూ బెర్బెరిస్ ఆపియాటికా కలిపిన సారాయిని తెల్ల ఎలుకలమీద (albino rats) ప్రయోగించి చూడగా అది వాటి రక్తంలోని చక్కెర భాగాన్ని బాగా తగ్గించింది. మూడు రకాల బెర్బెరిస్ కూడా మానవులలో వచ్చే కేన్సర్ మీద అమోఘంగా పని చేస్తుంది. బెర్బెరిస్ లైపియమ్ అమోబియాసిస్ (గ్రహణి, రక్త విరేచనాలు) మీద చాలా బాగా పని చేస్తుంది. ప్రొ. దత్తా, అయ్యర్‌లు దీనిని లేబరేటరీలో ఒక రకం ఎలుకల (golden hamsters మీద ప్రయోగించి చూశారు.

కలరా వ్యాధిని కలిగించే 'వైబ్రియో కోలేరే' అనే సూక్ష్మ క్రిముల ఉత్పత్తిని బెర్బెరిస్ నిరోధిస్తుంది. అయితే వ్యాధి ముదిరిన దశలో దీనివల్ల ఎక్కువ ప్రయోజనం ఉండదు.

356 మంది కలరా రోగులకు బెర్బెరైన్ తోనూ, 264 మందికి 'క్లోరాంఫెనికోల్'తోనూ చికిత్స చేసి, వాటి ఫలితాలను డా. లాహిరీ, డా. దత్తా పరిశీలించారు. సూక్ష్మక్రిములు ఉన్న రకం, లేని రకం కలరాలు రెండింటి మీదా బెర్బెరైన్ బాగా పనిచేయడం గమ

## చెట్ల వల్ల లాభాలు



ఒక ఎకరం మేరలో పెరిగే చెట్ల నుంచి 18 మంది ఒక ఏడాది పాటు పీల్చడానికి సరిపోయే 4 టన్నుల ప్రాణ వాయువు ఉత్పత్తి అవుతుంది. సక్రమంగా నీళ్ళు పోసి పెంచే ఒక చెట్టు, గదిలో అమర్చే సైజు 10 ఎయిర్ కండిషనర్లు 24 గంటలసేపూ పని చేస్తే ఇచ్చేటంత చల్లదనాన్ని ఇస్తుంది. గాలిలోని ధూళినీ, పుష్ప పరాగాన్ని, మాలిన్యాలనూ చెట్లు వడకడతాయి. ధ్వనిని 50 శాతం తగ్గించడానికి చెట్లు తోడ్పడుతాయి. గాలి తీవ్రతకు నిరోధకాలుగా కూడా చెట్లు ఉపయోగిస్తాయి. వర్షపు నీరు సూటిగా నేల మీద పడి సారవంత మైన మట్టి కొట్టుకు పోకుండా చెట్ల ఆకులు నిరోధిస్తాయి.

"ఉపకారం పొందిన వారు మరచిపోకూడదు;
చేసిన వాడు గుర్తుంచుకోకూడదు." -ఛారన్

నించారు. 'క్లోరా పెనికోల్' కంటె బెర్బె రైన్ వాడడం వల్ల మరణాల సంఖ్య, విరేచనాల పరిమాణం, రోగ వ్యవధి, రక్తం ద్వారా ఎక్కించే ఆహార పరిమాణం కూడా బాగా తగ్గిపోయాయి. పూర్తిగా కోలుకునే వ్యవధి (convalascence period) కూడా తగ్గింది. మరో విశేషం: దీనిని ఒక నిర్ణీత మైన మోతాదులో వాడితే అవాంతర దుష్ఫలి తాలు ఏవీ ఉండవు. తడవకు 15 మి.గ్రా. ల చొప్పున 2 రోజులపాటు రోజుకి 6 గం ల కొకసారీ, మూడో రోజున 8 గం.ల కొకసారీ, 4 వ రోజున ఒకేసారీ—ఈ మోతాదులలో దీనిని సేవించాలి.

1972 లో 'జియార్డైయాసిస్' వ్యాధితో బాధపడే 25 మంది రోగులకు ప్రొ. చౌదరి బెర్బరైన్ రోజుకి రోగి శరీరం బరువును బట్టి ఒక్కొక్క కి.గ్రా కి 5 మి.గ్రా. ల చొప్పున 6 రోజులపాటూ, 9 మందికి 'మెట్రోనిడజోల్' రోజుకి కి.గ్రా. ఒకటికి 10 మి.గ్రా. ల చొప్పున 6 రోజులపాటూ; 20 మందికి వైటమిన్ 'బి' కాంప్లెక్స్ 6 రోజులపాటూ ఇచ్చి వాటి ఫలితాలను పోల్చి చూశారు.

బెర్బరిస్ ఎక్స్ట్రాక్ట్‌తో 1970 లో డా. శారద మరో ప్రయోగం చేసింది. 50 మంది పిల్లలకు వచ్చిన గాస్ట్రో ఎంట్రెటిస్ (ఒకరకం కలరా) వ్యాధికి ఆమె బెర్బెరైన్‌తో చికిత్స చేసింది. విరేచనాలు కట్టించడానికి అది పటిష్ఠ మైన మందనీ, పిల్లలకు కూడా దానిని నిక్షే పంగా వాడవచ్చు ననీ ఆమె ప్రకటించింది. దానిలో ఎలాంటి విష పదార్థాలూ లేవు.

పైన చెప్పిన డాక్టర్లందరూ అలోపతీ డాక్టర్లు నిత్యం మనం వాడుకునే పసుపు ఎంత అసాధారణ మైన మహిమ గలదో తమ ప్రయోగాల ద్వారా వారు రుజువు చేశారు ●

---

## "నా సమస్యలు మరింత జటిలమైనవి!"



సాపేక్షతా సిద్ధాంతాన్ని స్థాపించిన సుప్రసిద్ధ శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్‌స్టైన్‌కి కేవలం గణితం మాత్రమే కాక ఇంకెన్నో వ్యాప కాలు ఉండేవి. మొదటి సారిగా ఇటీవలనే ప్రచురితం అయిన ఐన్‌స్టైన్ లేఖలలో ఆయన సుభాషితాలూ, ఛలోక్తులూ ఎన్నో కనిపిస్తాయి. అదృష్టం కలసిరాని ఒక విద్యార్థిని ఓదారుస్తూ ఆయన ఇలా వ్రాస్తాడు: "నీ గణిత సమస్యలు తలుచుకొని తల క్రిందులు కాకు! నమ్ము - నా సమస్యలు మరింత జటిలమైనవి."

"దేవుడు 'బానిస'గానూ ఉండవచ్చు;
'యజమాని'గానూ ఉండవచ్చు!" —హొరేస్

# వనితా లోకం

## మీ ముఖం అందంగా ఉండాలంటే...?

డా. సుసన్ జార్జ్

మనిషి ఆరోగ్యానికి అద్దం లాంటిది ముఖం. 'వెండి తెర తార లంత అందంగా మనం లేమే!' అని నిరుత్సాహ పడకండి. మీరూ అందంగా కనిపించవచ్చు. పౌడర్లూ, స్నోలూ మొదలైన సౌందర్యపోషక పదార్థాల మీద



డబ్బూ, సమయం, శక్తీ వృథా చేసే బదులు అంతర్గతమైన మీ జీవశక్తిని పెంపొందించు కునే ప్రయత్నం చెయ్యండి. తాజాపళ్ళూ, దుంపలూ, పచ్చి కూరలూ బాగా తినండి. ముఖానికి కాస్మెటిక్స్ బదులు ఆలివ్ నూనె గాని, కొబ్బరి నూనె గాని, నువ్వుల నూనె గాని వారానికి 3,4 సార్లు మర్దన చెయ్యండి.

కాస్మెటిక్స్ వాడకం వల్ల చర్మం లోని రంధ్రాలు పూడిపోయి శరీరంలోని మాలిన్యా లను బయటకు నెట్టే ప్రక్రియకు అంతరాయం ఏర్పడుతుంది. అలా కాకుండా నూనెల మర్దన ముఖంలో రక్త ప్రసారాన్ని పెంచు తుంది.

ముఖంమీద మచ్చలు ఉంటే ప్లాస్టిక్ సర్జరీ అవసరం లేదు. దోసకాయ కోరి, ఆ కోరును

(మిగతా 53వ పేజీలో)

---

## బావ పరిచయ పోటీ



"పరుల మీద పన్నీరు పోస్తే గదా
మన మీద పూల వాన కురిసేందుకు!"

—ఎన్. బోసు, కలకోట.

* * *

"బురద చిందించే డాబు
అయింది దుమ్ముతో ఖరాబు!"

—బి. ఎస్. చార్లు, కర్నూలు.

* * *

"ఆడపిల్లల్ని ఏడిపించా లని ఉబలాటం!
తప్పుతుందా మరి గుణపాఠం!"

—కె. విజయ శ్రీధరబాబు, అనంతపురం.

"మంచి తనమే హుందాతనం!" — టెన్నిసన్

# జీవితం నేర్పిన పాఠాలు

## జీవితమే ఒక గొప్ప గ్రంథాలయం!

ఖ్వాజా అహ్మద్ అబ్బాస్



[హర్యానా రాష్ట్రంలోని చరిత్రాత్మక మైన పానిపట్ నగరంలో 1914 జూన్ 7 వ తేదీన ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ జన్మించారు. 1933 లో బి. ఏ. పట్టభద్రులై మరి రెండేళ్ళకు ఆలిఘర్ ముస్లిమ్ విశ్వ విద్యాలయంలో న్యాయశాస్త్ర పరీక్ష పాస్ అయారు పత్రికా విలేఖకుడుగా, గ్రంథ కర్తగా, హిందీ సినిమాల రచయితగా, నిర్మాతగా, దర్శకుడుగా సుప్రసిద్ధులు శ్రీ అబ్బాస్.]

**'జీవితం' నాకు ప్రధాన గురువు: ఎన్నెన్నో అంశాలు నాకు 'జీవితం' బోధించింది.**

ముఖ్యంగా - విశ్వసించడం నేను 'జీవి తం' నుంచి నేర్చుకున్నాను. అన్నిటి కంటె 'మనిషి'లో నాకు ఎక్కువ నమ్మకం. కట్టెల కొట్టే మనిషి, నీరుతోడే కూలి పూదోటల పెంచే తోటమాలి. సౌందర్యం సృష్టించే కళాకారుడు, కవి. శిల్పి, శాస్త్రవేత్త రోడ్లనూ, రైలు మార్గాలనూ, వంతెనలనూ నిర్మించే ఇంజనీరు. ప్రేమికుడు - కష్టపడి పని చేసే ఇలాంటి ప్రతి మనిషిలోనూ, నా అఖండమైన నమ్మకం!

## మారణాయుధాల కోసం పెడుతున్న ఖర్చు

ప్రతి 2 సెకనులలోనూ ప్రపంచంలో మారణాయుధాల కోసం పెడుతున్న ఖర్చు రూ. 1,65.000 లు. ప్రతి 2 సెకనులకు ఒకరు చొప్పున ప్రపంచంలో శిశువులు మ ణిస్తున్నారు. శిశువులను పొట్టను పెట్టుకు టున్న 6 ప్రధాన వ్యాధుల నుంచి రక్షణ కల్పించడానికి ఒక్కొక్క శిశువు క్రిం కేవలం రూ 50. లు ఖర్చు పెడితే ఆ శిశు మరణాలను అరికట్టి వచ్చును.

"చాలామందికి ఫిర్యాదుల 'క్యూ'లో నిలబడడం సరదా! -లా రామోర్

నా మీద నాకు గల నమ్మకాన్ని కూడా 'జీవిత'మే నాకు నేర్పింది. ఈ మానవ సముద్రం తాలూకు ఓ చిన్న నీటి బొట్టును నేను మానవత్వం అనే 'సహారా' ఎడారిలోని ఒక ఇసుక రేణువును నేను. ప్రాణంతో స్పందిస్తూ జీవిస్తూన్న అస్తిత్వాన్ని నేను. ఊరికే జీవించడమే కాదు; స్త్రీలలోనూ, పురుషులలోనూ, ప్రకృతిలోనూ కనిపించే అద్భుత సౌందర్యాన్ని ప్రేమించ గలవాణ్ణి. సమస్త మానవ జాతీ నాలో ఉంది. మానవ జాతి అంతటిలో నేను ఉన్నాను. మానవీయమైన దర్శన శాస్త్రం, నీతి శాస్త్రం, వివేకం, కారుణ్యం - వాటికి ప్రతినిధులైన గౌతమ బుద్ధుడు, మోసెస్, శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, క్రీస్తు, మహమ్మద్, గురు నానక్, కబీర్, సూఫీ కవులు, యోగులు - అందరూ నాలో ఉన్నారు. అందరిలోనూ నేను ఉన్నాను.

యోగులే కాదు. తత్త్వవేత్తలు, కవులు, భావాలలో, ఆచరణలో విప్లవాలు తెచ్చిన మహారథులు-కార్ల్ మార్క్స్, ఆయన బోధించిన మార్క్సిజమ్, లెనిన్, టాల్‌స్టాయ్, 'అర్ధ నగ్న ఫకీర్'గా ప్రసిద్ధి పొందిన గాంధీ, రొమేం రోలాం, టాగూరు, 'స్వరాజ్యం నా జన్మ హక్కు' అని చాటి, తత్ఫలితంగా బర్మాలోని మాండలేలో ప్రవాస శిక్ష విధించబడ్డ తిలక్ - అందరూ నాలో ఉన్నారు. అందరిలోనూ నే నున్నాను.

తన ప్రజలు పరస్పరం గొంతులు కోసుకోకుండా ఉండే నిమిత్తం తన ప్రాణాలు ధారపోసిన గాంధీజీ, విప్లవాత్మకంగా, నిర్మాణాత్మకంగా ఆలోచించే విశాల హృదయుడు జవహర్ లాల్ నెహ్రూ, ఆత్మతత్త్వ దర్శి, మహాకవి ఇక్బాల్, విశ్వజనీన దృష్టి గల వివేకానందుడు - అందరూ నాలో ఉన్నారు. అందరిలో నేను ఉన్నాను. వారందరి ఆలోచనలే, వారి కవితలే నాకు ఒక రూపాన్ని ఏర్పరిచాయి.

కార్యదక్షులైన స్త్రీ, పురుషు లందరిలోనూ నాకు ప్రగాఢమైన విశ్వాసం:

అంతర్వాణి ఆదేశాలను విని, దేశం కోసం అగ్నికి ఆహుతి అయిపోయిన 'జోన్ ఆఫ్ ఆర్క్', 'తన ఝాన్సీ' కోసం కాక 'మన ఇండియా' కోసం ప్రాణాలు అర్పించి పోరాడిన ఝాన్సీరాణిలక్ష్మీబాయి, ఫ్రాన్స్‌లో,



"గుర్రాల్లాగ వెనక్కి తన్నే స్వభావం గల వారు ముందుకు వెళ్ళలేరు." — బెనెడిక్ట్

అమెరికాలో, రష్యాలో గొప్ప విప్లవాలు తెచ్చిన మహా యోధులు, తమ మాతృ దేశం అయిన ఇండియాకు దాస్య విముక్తి కలిగించాలనే ఆకాంక్షతో అసాధ్యమైన పనికి పూను కొని ఒక చిన్న పడవలో కెనడా నుంచి ఇండియాకు బయలుదేరిన మహా సాహసులు, జలియన్‌వాలా బాగ్ దురంతంలో ఆత్మార్పణ చేసిన వీరులు, ఆ దురంతానికి కారణమైన ఆంగ్లేయుణ్ణి లండన్‌లో కాల్చి చంపిన ఉద్దామ్ సింగ్, లాలా లజపత్ రాయ్ మరణానికి కక్ష సాధించి 'ఇంక్విలాబ్ జిందాబాద్' అనే నినాదాన్ని మనకు ప్రసాదించిన భగత్ సింగ్ -

అంతరిక్ష యానంలో ధ్వని వేగంతో మొట్టమొదటి సారిగా భూమిని చుట్టి రావడమే కాక, తెలియని దాన్ని తెలుసుకోవాలన్న ఆ మహోద్యమంలో అసువులు బాసిన గగారిన్, చంద్రుని మీద పాదం మోపిన ఇతర అమెరికన్, రష్యన్ వ్యోమగాములు -

లైంగిక ప్రవృత్తికీ, స్వప్నాలకూ సంబంధించిన అద్భుత సత్యాలను త్రవ్వి తీసిన ఫ్రాయిడ్ -

సాపేక్షతా సిద్ధాంతాన్ని కనుగొన్న ఐన్‌స్టైన్ -

అందరిలోనూ నాకు ప్రగాఢమైన విశ్వాసం! వారందరూ నాలో ఉన్నారు. అందరిలోనూ నేను ఉన్నాను.

అన్నిటి కంటె ముఖ్యంగా - 'జీవితం' నాకు నేర్పిన పాఠం: విజ్ఞానం పుస్తకాలకే పరిమితం కాదని; విజ్ఞానానికి ఈ జీవితమే ఒక గొప్ప విజ్ఞాన భాండాగారం అని; వివిధ విజ్ఞాన సర్వస్వాల నుంచి కంటె ఒక చిన్న వాన చినుకు నుంచి ఎక్కువ జ్ఞానం నేర్చుకోవచ్చు నని!

జీవితాన్ని గౌరవించడం నేర్పింది నాకు 'జీవితం'. మానవ జీవితాన్నీ, జంతు జీవితాన్నీ మాత్రమే కాదు; ప్రకృతి జీవితాన్ని కూడా! నిజానికి అన్ని జీవితాలూ ఒక్కటే!

నిండుగా, నిర్మాణాత్మకంగా, ఉత్సాహ భరితంగా జీవించడం నేర్పింది నాకు జీవితం!

## పెంగ్విన్ పిట్టలు పిల్లల్ని పెంచే తీరు



ఎప్పుడూ నీరు గడ్డకట్టి ఉండే అంటార్కిటిక్ సముద్ర ప్రాంతంలో పెంగ్విన్ పిట్టల పిల్లలు ఆహారం స్వయంగా జీర్ణం చేసుకోడం కూడా సమస్యే! అందుకే తల్లి పిట్ట ఆహారాన్ని ముందుగా తను తిని, అది సగం జీర్ణం అయాక నోరు తెరుస్తుంది. పిల్ల పెంగ్విన్ తల్లి నోటిలో నోరుపెట్టి సగం జీర్ణమైన ఆ ఆహారాన్ని ఆరగిస్తుంది.

"అందరికీ ఆనందాన్ని సాధిస్తే తప్ప
ఏ ఒక్కడూ ఆనందంగా ఉండలేడు!" -సర్ జగదీశ్ చంద్రబోస్

# నవ్వు

## బలే చిత్రమైన ఆవు!

ఒక నవనాగరక యువతి మొదటిసారి ఒక పల్లెకు వెళ్ళినప్పుడు ఇలా అంది: "అరే - బలే చిత్రంగా ఉందే ఈ ఆవు! దీనికి కొమ్ములు అసలు లే వెందుచేత?"

రైతు: ఆవుకు కొమ్ములు లేకపోవడానికి అనేక కారణాలు ఉండచ్చు అమ్మగారూ! అయితే ఈ 'ఆవు'కు కొమ్ములు లేకపోవడానికి కారణం-ఇది ఆవు కాదు, గుర్రం!"

* * *

## నాకు లాయర్ అక్కరలేదు:

న్యాయాధిపతి: నువ్వు లాయర్‌ని పెట్టుకున్నావా?

ముద్దాయి: లేదు సార్!

న్యాయాధిపతి: లాయర్ అవసరం అని నీకు తెలియదా?

ముద్దాయి: నాకు లాయర్ అక్కర లేదు సార్! నేను నిజం ఒప్పేసుకోబోతున్నాను.

* * *

## బిల్లును సగానికి తగ్గించే పరికరం

నారాయణ: నేను మోసపోయానే!

భార్య: అసలు ఏం జరిగిందండీ?

నారాయణ: "మీ బిల్లును సగానికి తగ్గించే పరికరం కావాలంటే రూ. 15 లు పంపండి!" అని ఒక ప్రకటన చూసి వెంటనే వారికి డబ్బు పంపించాను.

పంపిస్తే?

నారాయణ: వాళ్ళు నాకో కత్తెర పంపారు.

(మిగతా 48 వ పేజీలో)

## బూట్లు జారకుండా చేసే నాడాలు



ఏ. పి. ఏ. నాడాలను బూట్ల అడుగున ఒక పట్టాతో బిగించడం ద్వారా పిండిమంచు మీద గాని, మంచుగడ్డ మీద గాని కాలు జారకుండా తేలికగా నడవవచ్చును. ప. జర్మనీలోని ఫెల్‌బాఖ్‌లో తయారయ్యే ఈ నాడాల పట్టాలను కొన్ని సెకన్ల వ్యవధిలోనే బూట్లకు బిగించుకో వచ్చునట!

"వాదన కెప్పుడూ ఇద్దరుండాలి - మీరు వివాహితులైతే తప్ప!" —టామీ రీజ్

# ఆశ్చర్యకరమైన విషయాలు

## చెల్లించుకున్న శపథం

సదానంద మొహంతి

బళ్ళో చదువుకుంటున్న రోజుల్లో లాల్ బహదూర్ శాస్త్రి ఒక రోజున తోటి పిల్లలతో కలిసి దగ్గరలో ఉన్న ఒక పుణ్యక్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ ఆలయం సమీపంలో ఉన్న ఒక శిలా ఫలకం మీద చాలా మంది తమ పేర్లు చెక్కుకుని ఉండడం చూశాడు. ఎంతో సంతోషంగా తను కూడా తన పేరు ఆ శిల మీద చెక్కాడు.



అయితే—ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. అవాళ తాను చేసిన పనిని గురించే మధన పడసాగాడు. ఆ శిల మీద తన పేరు చెక్కుకోడం వల్ల తన కేమి ఒరిగింది? కొన్నాళ్ళకు ఆ రాతి మీది అక్షరాలు చెరిగిపోతాయి. తను చేసిన పని వట్టి మూర్ఖపు పని! వెంటనే లేచి ఆ అర్ధరాత్రికి అర్ధ రాత్రి తిరిగి ఆ ఆలయానికి వెళ్ళి ఆ శిల మీద తను చెక్కిన తన పేరును చెరిపేసి వచ్చాడు.

ఆ క్షణంలోనే ఆయన ఒక శపథం తీసుకున్నాడు - 'ఎప్పటికైనా దేశానికి ఉపయోగించే ఘనకార్యం చేసి ప్రజల హృదయాలలో తన పేరు శాశ్వతంగా ముద్రించుకోవాలి' అని; 'శిలాఫలకం మీది తన పేరును ప్రజాహృదయాల మీదికి పరివర్తింప చెయ్యాలి' అని.

ఆ నాడు ఆ విధంగా పట్టిన శపథాన్ని అనంతర జీవితంలో అతడు అక్షరాలా చెల్లించుకున్నాడు. 1965 లో భారత ప్రజ అందరూ తమ ఏకైక మహా నాయకుడుగా ఆయనకు బ్రహ్మరథం పట్టారు. భారత జాతి అగ్రనాయకులలో ఒకరుగా ఆయన ఈ నాడు పరిగణింపబడుతున్నారు.

## రష్యాలో శత వృద్ధులు

ప్రస్తుతం రష్యా దేశంలో 100 ఏళ్ళు నిండిన శతవృద్ధులు 18,000 దాకా ఉన్నారు.

"ఏష ఆత్మా న ప్రవచనేన లభ్యః"
(కేవలం వేదాలు వల్లించడం వల్ల ఆత్మ సాక్షాత్కారం కాదు) -కఠోపనిషత్

# మంచి దస్తూరీ అలవరచుకోడం ఎలా?

హరిదాస్ మరోలీ



[కళ్ళికోట జిల్లా (కేరళ) లోని 'మలపరంబ' లోని 'ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కాలిగ్రఫి'కి శ్రీహరిదాస్ మరోలీ స్థాపకులు, దర్శకులు. కేరళ ప్రభుత్వంలో జైళ్ళశాఖలో గజెటెడ్ ఆఫీసరుగా రిటైరయిన శ్రీ మరోలీ స్వయంగా మంచి లేఖన కళాకారుడు.]

ఆలోచనలను కాగితం మీద నమోదుచేసే సాధనం అయిన 'లేఖనం' చేతి కదలికల వల్ల రూపొందుతుంది. మంచి దస్తూరీకి ఒక లక్షణం 'పఠనానుకూలత' (legibility). లేఖకుని వ్యక్తిత్వం అతని దస్తూరీలో ప్రకటితం అవుతుందని కచ్చితంగా చెప్పవచ్చును. చిన్నప్పుడు బడిలో దిద్దుకున్న కుదురైన అక్షరాల నుంచి దస్తూరీ మారుతూ వచ్చిన కొద్దీ ఎక్కువెక్కువగా అతని ప్రత్యేకతను అది చాటుతుంది. దస్తూరీలో పఠనానుకూలత కంటె కూడా వ్యక్తిత్వ ముద్ర మరింత ప్రధానమైనదిగా భావించడం కద్దు. మంచి దస్తూరీ పఠనానుకూలంగానూ, అనుకరింపరానిదిగానూ ఉండడమే గాక, ఒక కళారూపంగా కూడా పరిణమించవచ్చును. వ్రాసేవారికీ, చదివేవారికీ కూడా దస్తూరీ ఆనందం కలిగిస్తూ ఉండడం ఎంత గొప్ప సంగతి! సర్వసాధారణమైన దస్తూరీ 'కళారూపం' స్థాయిని అందుకోడం ఎంత గర్వించదగిన అంశం! మన మాటలకూ, ఆలోచనలకూ 'ప్రసంగం' ఎంత ఆహ్లాదకరమైన సాధనమో, మన దస్తూరీ కూడా అంత సొగసైన పరికరం!

## 'ధన్వంతరి' అవార్డు అందుకొన్న న్యూరో-సర్జన్

మద్రాసులోని సుప్రసిద్ధ న్యూరో సర్జన్ డా॥ బి. రామమూర్తి గత అక్టోబరు 30 న బొంబాయిలో జరిగిన ఒక సభలో 'ధన్వంతరి' అవార్డు అందుకున్నారు. మద్రాసు మెడికల్ కాలేజీలో 'న్యూరో-సర్జరీ' విభాగానికి అధిపతిగానూ, ప్రొఫెసర్‌గానూ ఆయన పని చేశారు.

**"అలవాటును ఆదిలోనే అరికట్టకపోతే ఆ తరువాత అది 'అవసరం'గా మారుతుంది."** -సెంట్ అగస్టిన్

దస్తూరీ అనేది పుట్టుకతోనే సహజ సిద్ధంగా వచ్చేది అనీ, దాన్ని మెరుగుపరచుకునేందుకు ఓపికగా కాపీలు వ్రాయడం తప్ప వేరే సులభ సూత్రాలు ఏవీ లేవనీ సాధారణంగా జనం అనుకుంటూ ఉంటారు.

అడ్డంగా రెండు రూళ్లు వేసి దానిలో మేష్టారు ఒరవడి పెట్టడం, దానిని చూసి క్రింది రూళ్ళలో విద్యార్థులు కాపీ వ్రాస్తూ ఉండడం - మన స్కూళ్ళలో దస్తూరీ మెరుగు పరచుకునేందుకు సంప్రదాయంగా పాటిస్తున్న పద్ధతి ఇదే: అయితే - ఇలా పెట్టే 'ఒరవడి' చెయ్యి తిరిగిన లేఖనానికి నిదర్శనం కాదు. మెల్లగా పట్టి పట్టి వ్రాసే వ్రాత అది. అభ్యాసం వల్లనే చెయ్యి యథేచ్ఛగా తిరుగడం, వేగంగా వ్రాయడం అలవడుతాయి.

వేగంగా వ్రాసేటప్పుడు సహజంగా లేఖనంలో మార్పు వస్తుంది. అందుచేత - కాపీలు వ్రాయడం అనేది కొత్తగా చేసే ప్రయాణానికి స్థూలంగా మార్గనిర్దేశం చేసేది మాత్రమే: ఆ తరువాత అసలు ప్రయాణంలో తిరిగే మలుపు లన్నీ వ్యక్తి ఇష్టాన్ని బట్టి నిర్ణయం అయేవే: ఆ మలుపుల నిర్ణయంలో ఆత్మ విమర్శ, ఆత్మోపదేశం మాత్రమే ఎక్కువగా తోడ్పడగలవు.

'లేఖన కళ' (calligraphy)ను గూర్చి మనలో ఎందరికి తెలుసు? దస్తూరీ ఒక చేతిపని (handi-craft), అది ఒక కళ. కొన్ని ప్రధాన సూత్రాలను పాటిస్తూ ఆ కళను అధ్యయనం చేయవచ్చును. అలా నేర్చుకునేదే 'లేఖన కళ'! ఈ కళకు సంబంధించిన నియమాలనూ, సూత్రాలనూ శ్రద్ధగా పాటిస్తే దస్తూరీలో సొగసు, పఠనానుకూలత మాత్రమే గాక, వేగంగా వ్రాయగల వాక చక్యం కూడా సిద్ధిస్తుంది.

---

## ప్రపంచంలోని పెద్ద దేశాలలో ఇండియా ఆరోది



భూమి విస్తీర్ణం దృష్ట్యా ఇండియా ప్రపంచంలోని పెద్ద రాజ్యాలలో ఆరోది; ఆసియాలోని పెద్ద రాజ్యాలలో రెండోది. చైనా తరువాత 70 కోట్ల జనాభాతో కూడిన ఇండియాయే ప్రపంచంలో అధిక జనాగల దేశం. పారిశ్రామికంగా ఎక్కువ అభివృద్ధి సాధించిన మొదటి 10 దేశాలలో ఇండియా కూడా ఉంది. సైనికంగానూ శాస్త్ర, సాంకేతిక రంగాలలోనూ కూడా ఇండియా గణనీయమైన ఘనత సాధించింది

"ఆకలితో గిలగిల్లాడే వాడికి దేవుడు
అన్నం రూపంలోనే దర్శన మిస్తాడు!"

సంప్రదాయంగా దస్తూరీ మెరుగుపరచు కోడానికి అవలంబిస్తూ వచ్చిన పద్ధతులకూ, ఇప్పుడు కొత్తగా రూపొందించిన పద్ధతులకూ తేడా ఏమి టంటే సంప్రదాయ పద్ధతిలో మనకు తెలియకుండానే 'లేఖన కళా' సూత్రాలను పాటించడం జరిగితే, నూతన విధానంలో ముందుగా సూత్రాలు తెలుసుకొని మరీ అభ్యాసం కొనసాగిస్తున్నాము.

లేఖన కళ తాలూకు కొన్ని ప్రధాన సూత్రాలు :

1. వ్రాసేటప్పుడు చేతిపట్టు ఒకేవిధంగా ఉండేట్టు చూడాలి. అంటే - చెయి నిటారుగా ఉంచితే చివరిదాకా అలాగే ఉంచాలి. కుడి ప్రక్కకో, ఎడమ ప్రక్కకో వాల్చి వ్రాయదలిస్తే చేతిని చివరిదాకా అలాగే వాల్చి వ్రాయాలి.

2. అక్షరాల ప్రమాణం ఒకదాని కొకటి అనుగుణంగా ఉండేట్టు చూడాలి. కొన్ని పెద్దవీ, కొన్ని చిన్నవీ కాకూడదు.

3. తలకట్టు, క్రింది వత్తులు ఒకదాని కొకటి సమాంతరంగా ఉండాలి.

4. రెండక్షరాల మధ్య విడిచే జాగా అన్ని చోట్లా ఒకే విధంగా ఉండాలి.

5. కలిపి వ్రాతలో అతుకులు కూడా అన్నిచోట్లా ఒకే విధంగా ఉండాలి.

6. సరళంగానూ, హుందాగానూ చెయి కదులుతూ లేఖనం సాగాలి. అభ్యాసంవల్ల చేతిని హుందాగా కదపడమూ, వేగమూ అలవడుతాయి.

7. అక్షరా లన్నీ ఒకే లైన్‌లో ఉండాలి. పంక్తులలో వంకర రాకూడదు.

దస్తూరీని బాగుపరుచుకోవా లంటే అన్నిటి కంటె ముఖ్యంగా కావలసింది దృఢ సంకల్పం, దీక్ష.

(ఆల్‌ఫ్రెడ్ ఫెయిర్‌బ్యాంక్ వ్రాసిన 'ఏ హాండ్ రైటింగ్ మాన్యువల్' సౌజన్యంతో)

## బంధు సంపర్కాన్ని పరిహరించే 'ప్రెయరీ' కుక్కలు



ఉ. అమెరికాలో 'ప్రెయరీ' మైదానాల లోని కుక్కలు తమ కుటుంబ సభ్యులతో సంగమించవు. ప్రిన్స్‌టన్ యూనివర్సిటీకి చెందిన జంతు ప్రవర్తన పరిశోధకుడు జాన్ హూగ్లండ్ పరిశీలించిన 200 సంగమాలలో కేవలం 4 మాత్రమే బంధుత్వం ఉన్న కుక్కల మధ్య జరిగాయి. తనకు పుట్టిన ఆడకుక్క పిల్లలకు యుక్తవయస్సు రాగానే తండ్రి కుక్క ఆ ప్రాంతం వదలి దూరంగా పోతుం దట.

"కొందరు పుట్టుకతో గొప్పవారు; కొందరు గొప్పతనం సాధిస్తారు; మరి కొందరికి గొప్పతనం ఆరోపించబడుతుంది." —షేక్స్‌పియర్

# ప్రపంచ నగరాలు

## హైదరాబాద్

ఇండియాకు హృదయ స్థానంలో ఉంది ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైదరాబాద్. ఇండియాకు ప్రధాన లక్షణమైన 'వైవిధ్యంలో ఏకత్వానికి' చక్కని నిద



చార్ మినార్

ర్శనం ఈ నగరం. ఉత్తర భారతానికి దక్షిణపు కొసనూ, దక్షిణ భారతానికి ఉత్తరపు కొసనూ ఉన్న ఈ నగరం ఉభయ ప్రాంతాల మధ్యా సంస్కృతి రంగంలో చక్కని వంతెన లాగ ఉపకరిస్తూంది.

10 లక్షల పైబడిన జనాభాతో కూడిన 'హైదరాబాద్', 'సికింద్రాబాద్' అనే జంట నగరాలు కలిపి ఏర్పడిన ఒక మహానగర ఇది. సుమారు మైలు పొడవున వ్యాపించి ఉన్న హుసేన్‌సాగర్ గట్టు (tank bund) ఈ రెండు నగరాలనూ కలుపుతూంది. 30 ఏళ్ళ క్రితం త్రవ్వబడిన హుసేన్‌సాగర సరస్సు గట్టు మీది రోడ్డు సాయంత్రం అయ్యే సరికి నియాన్‌లైట్ల వెలుగులలో మెరసిపోతూ జంట నగరాల పౌరులకు సాయం సమయ విహార భూమిగా ఉపయోగపడుతూంది.

### పోషణ లోపం వల్ల సంభవించే శిశు మరణాలు

పుష్టికరమైన ఆహార లోపం వల్లా అంటువ్యాధుల వల్లా ప్రపంచంలో రోజు రోజూ 40,000 మంది శిశువులు మరణి స్తున్నట్లు 'యూనిసెఫ్' (UNICEF) ప్రకటన వల్ల తెలుస్తూంది

"నక్షత్రాల పయనం కంటె ఒక గడ్డి రేకు సోయగం ఏ మాత్రం తక్కువది కాదు." —వాల్ట్ విట్మన్

గోల్కొండ నవాబులలో 5 వ వాడు మహమ్మద్ కులీ కుతుబ్ షా 1589 లో నిర్మించిన ఈ నగరాన్ని ఆదిలో ఆ నవాబు ప్రేయసి అయిన 'భాగ్యమతి' పేరు మీదుగా 'భాగ్యనగరం' అనేవారు. 1725 లో అసఫ్ జాహీ నిజాముల్ ముల్క్ ఢిల్లీలోని మొగల్

1591 లో మహమ్మద్ కులీ కుతుబ్ షా తన రాజ్యంలో లక్షలాది ప్రజల ప్రాణాలను పొట్టను బెట్టుకున్న ప్లేగు వ్యాధి ఉపశమించిన సందర్భంలో ఆ సంతోష సంస్మరణ చిహ్నంగా ఈ కట్టడాన్ని నిర్మించారు.

హైద్రాబాద్ లోని ముస్లిముల ప్రధాన



ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల

చక్రవర్తుల అధికారాన్ని ధిక్కరించి స్వతంత్రత ప్రకటించిన నాటినుంచీ ఈ నగరం ...గా పెరగడం మొదలు పెట్టింది. క్రమంగా ...కళలకూ, సంస్కృతికీ ఒక ప్రధాన కేంద్రం అయింది. ఈ నగరంలోని మసీదులూ, ఆలయాలూ, గొప్ప గొప్ప భవంతులూ ఈ నగర ...పొందిన వైభవాన్ని చాటుతున్నాయి.

ఒక ప్రణాళిక ననుసరించి అందంగా నిర్మించిన ఈ నగరం మధ్య భాగంలో 16 వ శతాబ్ది నాటి చార్ మినార్ (నాలుగు స్తంభాల మండపం) అనే ప్రసిద్ధమైన కట్టడం ఉంది.

## 40 రోజుల పాటు భూగర్భ సమాధిలో ఉన్న యోగి

1837 లో హరిదాస్ అనే యోగి పంజాబ్ లోని లాహోర్ నగరంలో 40 రోజులపాటు అన్న పానాదులు గాని, గాలి గాని లేకుండా భూగర్భ సమాధిలో ఉన్నారు. 40 రోజుల తరువాత శిష్యులు ఆయనను పైకి తీయగా సమాధిలో నుంచి బయటికి వచ్చి ఆయన కళ్ళు తెరిచారు. ఆ తరువాత చాలా ఏళ్ళు ఆయన జీవించారు.

"నిరంకుశ ప్రభుత్వం పెద్దపులి కంటె భయంకర మైంది!" —కన్ ఫ్యూషియస్

ప్రార్థనా మందిరం మెక్కా మసీదు. 10,000 మంది భక్తులు ఏక కాలంలో ఇక్కడ ప్రార్థన చేయవచ్చును. ఈ మసీదు నిర్మాణాన్ని మహ



ఫలక్‌నుమా ప్రాసాదంలో మెట్ల వరుస

మ్మద్ కుతుబ్‌షా ప్రారంభించగా కుతుబ్ షాహీ రాజులలో చివరివాణ్ణి జయించిన మొగలాయీ చక్రవర్తి ఔరంగజేబ్ దీనిని పూర్తి చేశాడు. దీని నిర్మాణంలో ఆశ్చర్యం కలిగించే అంశం: ఆర్చీలకు ఆధార భూతంగా ఉన్న ఎత్తైన స్తంభా లన్నీ ఏకాండ శిలలతో రూపొందించినవి.

హైద్రాబాద్‌లో ఇటీవల వెలసిన గొప్ప భవనాలలో చెప్పుకోవలసినవి: ఫలక్‌నుమా ప్రాసాదం, ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాలా భవనం. ఒకప్పుడు హైదరాబాద్ రాజ్య ప్రధానిగా ఉన్న నవాబ్ సర్ వికార్-ఉల్-ఉమ్రా నగర దక్షిణ భాగాన ఒక చిన్న గుట్ట మీద ఆ రోజులలో రూ. 35 లక్షల ఖర్చుతో ఫలక్‌నుమా ప్రాసాదాన్ని నిర్మించారు.

## లాయర్లకు సాయం చేసే

న్యూయార్కులోని లాయర్లు కేవలం 20 డాలర్లు చెల్లిస్తే 24 గంటల లోగానే ఒక కేస్‌తో పోలికలు గల వెనుకటి కేసు లన్నిటి తాలూకు భోగట్టానీ ఒక కంప్యూటర్ అందజేస్తుంది. నిముషానికి 1,20,000 కేసుల చొప్పున పరిశీలించి ప్రస్తుతపు కేసులాంటి కేసులలో వెనుక చెప్పిన తీర్పుల పూర్తి పాఠాన్ని అది లాయర్లకు అందజేస్తుంది.

“తలుపులు మూసుకున్న సమాజంలో జీవించడం దుర్భరం:
సరిక్రొత్త భావాలు సమాజానికి అవసరం!” —జవహర్‌లాల్ నెహ్రూ

నైజామ్ ప్రభుత్వంలో కొన్నాళ్ళు హోమ్ సెక్రటరీ గానూ, తరువాత ప్రధాని గానూ పని చేసిన సర్ అక్బర్ హైదరీ సూచన ననుసరించి 1918 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది నగరం బయట ఉన్న అడిక్ మెట్టలో నిర్మిత మైన విశ్వవిద్యాలయ భవనాల నిర్మాణంలో హిందూ, ముస్లిమ్ వాస్తు శైలుల మధ్య చక్కని సమన్వయం కనిపిస్తుంది. యూనివర్సిటీ కాంపస్‌లో నేత్రపర్వం చేసే చక్కని ఉద్యాన వనం ఉంది. ఒక అరబిక్ ఇన్‌స్టిట్యూట్, ఒక సంస్కృతం ఇన్‌స్టిట్యూట్, 'ది సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్' కూడా ఈ యూనివర్సిటీ కాంపస్‌లో నెలకొల్పబడ్డాయి.

మూసీ నది ఒడ్డున ఉన్న హైకోర్టు భవనం, ఉస్మానియా ఆసుపత్రి భవనం వంటి కన్ను చెదరగొట్టే గొప్ప భవనాలూ, మొగల్ పద్ధతిలో తీర్చిన చక్కని ఉద్యాన వనాలూ ఈ నగరంలో ముఖ్యంగా దర్శించ దగినవి. తీర్చిన 'దోమ్'లతో, చక్కని గోపుర స్తంభాల (minarets) తో తెలుపు ఎరుపు రాళ్ళతో కట్టిన హైకోర్టు భవనం ఠీవిగా కనిపిస్తుంది. ఉస్మానియా ఆసుపత్రి భవనం 3 అంతస్తుల పెద్ద కట్టడం।

నవాబ్ సాలార్ జంగ్ సేకరించిన అద్భుత కళా విధానాలుపొందుపరచిన సాలార్ జంగ్ మ్యూజియమ్ హైదరాబాద్ నగరంలో ఒక గొప్ప ఆకర్షణ. ఉత్తమాభిరుచి, అఖండమైన ఐశ్వర్యం ఉన్న సాలార్ జంగ్ జపాన్, చైనా, ఇటలీ, గ్రేట్ బ్రిటన్ మొదలైన దేశాల నుంచి విలువైన ఆభరణాలూ, వజ్ర వైడూర్యాలూ, చిత్ర పటాలూ, శిల్పాలూ, కలప మీదా, దంతం మీదా చెక్కిన నగిషీ పనులూ, చైనా వారి మనోహరమైన పింగాణీ వస్తువులూ-ఇలాంటి అపురూపమైన కళా ఖండాల నెన్నిటినో సేకరించారు. మేలి ముసుగులో నుంచి స్పష్టంగా కనిపించే రేషల్ (జేకబ్ ముద్దుల భార్య) తాలూకు

## టన్ను వజ్రాల ధర రూ. 4,500 కోట్లు



స్వచ్ఛమైన బొగ్గు నుంచి ఏర్పడే స్ఫటికాలు వజ్రాలు. భూగర్భం నుంచి బంగారం కంటె చాలా అరుదుగా ఇవి లభిస్తాయి. వజ్రాలలో మిక్కిల ప్రశస్తమైనవి ప్రస్తుతం బంగారం కంటె 12,000 రెట్లు ఎక్కువ ఖరీదు. ఆభరణాలుగానే కాక, కోత పరికరంగా కూడా వజ్రాన్ని వాడుతారు. సానపట్టిన వజ్రాలు ఒకటన్ను రూ. 4,500 కోట్లు ఖరీదుచేస్తాయి. ఏటా ప్రపంచంలో లభించే వజ్రాలు 2.5 టన్నులు మాత్రమే।

"ఎక్కువ పన్నుల భారం మోసే వారిని తక్కువ పన్నులు చెల్లించే వారు అణచి ఉంచగలిగినంత కాలమే ప్రభుత్వం నిలుస్తుంది."—బి. బెరెన్సన్

అద్భుతమైన పాలరాతి ప్రతిమా, ముందు నుంచి చూస్తే 'మెఫిస్టోఫెలిస్' (7 భూతాలలో ఒకటి) రూపం, వెనుక నుంచి చూస్తే 'మార్గరెట్టా' (రాకుమారి) రూపం కనిపించే దారు ప్రతిమా ఈ మ్యూజియమ్‌లో అవశ్యం దర్శించదగ్గవి.



మెఫిస్టోఫెలీస్, మార్గరెట్ ప్రతిమ

ఒక పథకం ప్రకారం నిర్మించిన ఆధునిక నగరం సికింద్రాబాద్. హైదరాబాద్ దృష్ట్యా ఇది కొంత ప్రశాంతంగా కనిపిసుంది. ఇండియాలోనే మిక్కిలి పెద్ద సైనిక స్థావరాలలో ఒకటి సికింద్రాబాద్‌లో ఉంది.

బోలారంలో ఉన్న రాష్ట్రపతి నిలయం పూర్వం బ్రిటిష్ రెసిడెంట్ ఉండే మందిరం. ప్రస్తుతం ఏటా భారత రాష్ట్రపతి దక్షిణాదిని గడిపే కాలంలో ఇది ఆయనకు విడిది.

హైదరాబాద్ నగరానికి పశ్చిమంగా సుమారు 400 అ. ల ఎత్తున్న ఒక గుట్టమీద ప్రాచీనమైన గోల్కొండ దుర్గం ఉంది. దీని చుట్టూ 76 బురుజులతో కూడిన ఎత్తైన రాతి ప్రాకారం ఉంది. కాకతీయ రాజుల కాలంలో ఇది మట్టికోట. కుతుబ్ షాహీ వంశపు నవాబుల కాలంలో క్రమేణ దీనిని పెంచడం, బలపరచడం జరిగింది దక్కన్ చరిత్రలో జరిగిన ఎన్నో యుద్ధాలకు రంగస్థలం ఈ దుర్గం. రాణులూ, రాకుమార్తెలూ, పౌరులూ కూడా కోటలోపలే ఉండేవారు. అంత పెద్ద కోట అది! క్రింది సింహద్వారం దగ్గర ఒకానొక స్థలంలో నిలిచి చప్పట్లు కొట్టినా, పెట్టినా కొండ శిఖరం మీది 'బారాదారీ'లో స్పష్టంగా అది వినిపిస్తుంది.

'బాలాహిస్సార్'కీ, రాజభవనానికీ మధ్య కట్టిన సుమారు 1/4 మైలు పొడవున్న త్రాడు మీద తారామతి, ప్రేమమతి అనే కుతుబ్ షాహీ నవాబు ప్రియురాండ్రు నృత్యం చేస్తూ, నృత్య కళలో తమకు గల అద్భుతమైన చాకచక్యం ప్రదర్శించేవారట!

హైదరాబాద్‌లో అపురూపంగా దొరికే వస్తువులు ఎన్నో ఉన్నాయి. కళాత్మకమైన 'నిర్మల్', 'బిద్రీ' సామానులకూ (ప్లేట్లు పెట్టెలు, జాడీలు మొ.), కోట్లకూ, శాలువలగానూ ఉపయోగించే హిమ్రూ గుడ్డకు హైదరాబాద్ ప్రసిద్ధి! ప్రాత నగరంలో దొరికే హైదరాబాద్ గాజులు ఒక ప్రత్యేకత గలవి విశిష్టమైన హైదరాబాద్ డిజైన్‌లలో వివి ఆభరణాలు కూడా అక్కడ అమ్ముతారు

---

"కాలాను గుణంగా మార్పును అంగీకరించకపోతే
అది ఒక ఉప్పెన అయి, మనల్ని ముంచి వేస్తుంది." —జవహర్‌లాల్ నెహ్రూ

# ప్రాణాయామం వల్ల లాభాలు

"మనస్సుకీ, మన శ్వాసప్రక్రియకూ దగ్గిర సంబంధం ఉంది. శ్వాస క్రమబద్ధం అయితే మనస్సు శక్తి పెరుగుతుంది."

మేలుకున్నా, నిద్రపోతున్నా ప్రతి రోజూ మొత్తం 25,900 సార్లు మనం శ్వాసించడం జరుగుతూంది.



ఊపిరి తిత్తులలోకి గాలి ఊరికే పీల్చడం వల్ల కాక, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను క్రమబద్ధం చేసుకోడం వల్లనే మనస్సులో శక్తిని పెరిగి మనం భర్తీ చేసుకోగలం. ప్రాణాయామంలో ముఖ్యమైన అంశం పూర్తిగా గాలిని బయటికి వదలడం.

ప్రతిసారీ పూర్తిగా గాలిని బయిటికి వదవడం వల్ల శీతోష్ణస్థితి మొదలైన పరిసరాలలో వచ్చే మార్పులతో మన శరీర తత్త్వం తేలికగా సరిపుచ్చుకో గలుగుతుంది. వక్తృత్వ కళలో ఆరితేరిన వారు క్రమబద్ధమైన శ్వాస ప్రక్రియ ఎంత విలువైందో గుర్తిస్తారు.

ఒక పెద్ద సభలో, లేదా అపరిచితుల ముందు ప్రసంగించవలసి వస్తే మనలో చాలామందికి వణుకు, కంగారు వచ్చేస్తాయి. అలాంటప్పుడు గాలిని గాఢంగా లోపలికి పీల్చడం, పూర్తిగా బయటికి వదలడం పలుసార్లు చేస్తే, ఆ భయం మటు మాయమై ధైర్యంగా మాట్లాడ గలుగుతాం.

---

## మిణుగురులు

"నాడు నా దేశం రత్నగర్భ!
నేడు నా దేశం రక్తగర్భ!!"
—పుష్పాల కృష్ణమూర్తి, లింగగిరి.

* * *

"హృదయాల సమూహమే సమాజం!
అయినా-హృదయం లేనిది సమాజం!!"
—డి. శిరీష, ప్రొద్దుటూరు.

* * *

ఆమె అంతరంగం నీకు తెలుసా?

* * *

"నిజం చెబితే విదేశీ తొత్తట!
దేశభక్తి వాడి ముత్తాత సొత్తట!"
—జి. నర్సారెడ్డి, ఫతేపూరు.

* * *

"ఎవరో వెంట వస్తున్నారని భ్రమ!
నాకే తెలియదు అది నా నీడని ఖర్మ!!"
—కె. విజయానంద, విశాఖపట్నం.

"దుఃఖం ఔషధంగా పని చేస్తుంది." -కౌపర్

'నిశ్వాస' (exhaling) కు ప్రాధాన్యం ఇస్తూ శ్వాస ప్రక్రియను క్రమబద్ధం చేస్తే ఎంతటి ప్రతికూల పరిస్థితులలో కూడా అతి సహజంగానూ, ఉల్లాసంగానూ ఉండగలం.

మనలో చాలామందిమి సగం సగమే శ్వాపిస్తూ ఉంటాం. గాలి పీల్చకుండా ఉండలేము గనుక గాలి పీలుస్తాం. కాని, గాలి బయటికి వదిలేటప్పుడు మాత్రం పూర్తిగా వదలం. ఈ ప్రక్రియలో లోప లికి పీల్చే గాలీ, బయటికి వదిలే గాలీ కలిసి పోయి శ్వాస ప్రక్రియవల్ల పొందగల పూర్తి లాభాన్ని మనం పొందలేక పోతున్నాం.

వేగంగా,లయాత్మకంగా గాలిని పీలుస్తూ, వదులుతూ ఉండే అభ్యాసం వల్ల ఊపిరి తిత్తులలోని బొగ్గుపులుసు గాలి పూర్తిగా బయటికి నెట్టి వేయబడడం, పుష్కలంగా ప్రాణవాయువు సరఫరా కావడం జరుగు తుంది. ఇది మనలో శక్తిని క్రమబద్ధం చేసి, తాజాతనాన్నీ, ఉత్సాహాన్నీ కలిగిస్తుంది. ప్రయత్నపూర్వకంగా ఒక క్రమంలో శ్వాసిం చడంవల్ల అద్భుతమైన ఫలితాలు కలుగుతా యనడానికి ఇది చక్కని నిదర్శనం.

మామూలుగా యథాలాపంగా ఎలాంటి ప్రత్యేక ప్రయత్నం లేకుండా మనం శ్వాపిస్తూ ఉంటాం. అలా కాకుండా ఎంత ఎక్కువ గాలిని మనం బయటికి వదిలితే అంత ఎక్కువగా ప్రాణవాయువును మనం పీల్చుకోగలుగుతాం. అలా పీల్చిన అదనపు ప్రాణవాయువు వలన మన శరీరానికీ, మన స్సుకూ కూడా ఎంతో మేలు కలుగుతుంది.

ప్రాణాయామం అభ్యసించడం వల్ల మన శరీరారోగ్యం, జీవశక్తి ఎక్కువ అవుతాయి. మన దైనందిన కార్యక్రమాలను ఓరింత

## 'టింబక్టూ' దర్శించిన మొదటి యూరపియన్



ఆఫ్రికాలోని సహారా ఎడారి దక్షిణపు అంచున నైజర్ నది సమీపంలో ఉన్న 'టింబక్టూ' నగరాన్ని చేరుకున్న తొలి యూరపియన్ 29 ఏళ్ళ ఫ్రెంచ్ జాతీయుడు రెనె అగస్ట్ గెయలీ. ఒంటె పయనాల వ్యాపార మార్గాలకు కూడలిగానూ, బానిసల వ్యాపార కేంద్రంగానూ ప్రసిద్ధి పొందిన 'టింబక్టూ' నగరానికి 1827 ఏప్రిల్ నెలలో ప. ఆఫ్రికాలోని 'కాకండి' నుంచి కాలి నడ కను బయలుదేరి కొండల మీదుగా ఎన్నో నెలలు ప్రయాణించి, చివరకు 1828 ఏప్రిల్ లో అతడు ఆ నగరం చేరుకున్నాడు. ఆ ఏడు సెప్టెంబరులో పారిస్‌లోని 'జియోగ్రాఫి కల్ సొసైటీ' టింబక్టూ దర్శించి, భద్రంగా తిరిగి వచ్చిన తొలి యూరపియన్‌గా అతనిని గుర్తించి, 10,000 ఫ్రాంక్‌లు అతనికి బహూకరించింది.

"బ్రదికినన్నాళ్ళూ ప్రపంచం అంతా పరిపాలింప జూచే మనిషికి చనిపోయాక ఎంత కొద్ది నేల సరిపోతుంది!" —ఫిలిప్

పటిష్ఠంగా మనం చేయగలుగుతాము. ఏదైనా బలమైన పని చేయవలసి వచ్చినప్పుడు శ్వాస పూర్తిగా విడువడం అవసరం అని తరుచు మనకు సలహా ఇస్తూ ఉంటారు.

సంపూర్ణంగా నిశ్వసిస్తూ ఉండే అలవాటువల్ల కలిగే ప్రయోజనం: 'ఆత్మ చేతన' (awarereess of the self) ఎక్కువ కావడం. దీనివల్ల మన వెనుకటి అలవాట్లు పోయి కొత్తగా ఇంకో దేహం మనకు ప్రాప్తించిన అనుభూతి కలుగుతుంది. ప్రయత్న పూర్వకమైన శ్వాస ప్రక్రియ వల్ల ఆసన శుద్ధి అనే అదనపు లాభం కూడా కలుగుతుంది

ఒంటరిగా ఉన్నప్పుడు, ఎవరి కోసమో ఎదురు చూస్తున్నప్పుడు, లేదా ఏ క్యూలోనో నిలబడి ఉన్నప్పుడు శ్వాసప్రక్రియకు సంబంధించిన అభ్యాసాలు చెయ్యండి. అందువల్ల మీ శక్తులూ, ఉత్సాహం పుంజుకునే విధంగా లాభదాయకంగా ఆ సమయాన్ని గడిపిన వారవుతారు. మీ మానసిక స్థితుల (moods) మీద కూడా ప్రాణాయామ ప్రభావం ఎంత ఎక్కువగా ఉంటుందో మీకే తెలుస్తుంది.

మనం నిత్యం చేసే ధ్యానం కూడా ప్రాణాయామానికి దోహదం చేస్తుంది. సక్రమ శ్వాస ప్రక్రియ మన దైహిక, మానసిక శక్తుల మధ్య చక్కని సమన్వయం సాధించి మన శక్తి, సామర్థ్యాలను పెంచుతుంది. ●

## ఇనుమును ఉక్కుగా మార్చి ఎగుమతి చేస్తే....?

"ఇండియా తన ఇనుప ఖనిజాన్ని ఉక్కుగా మార్చి ఎగుమతి చేసే పక్షంలో ప్రస్తుతం లభిస్తున్న రూ. 400 కోట్లకు బదులు ప్రపంచ విపణిలో రూ. 2,850 కోట్లు సంపాదించవచ్చు."

—ఆదిత్య విక్రమ్ బిర్లా (పారిశ్రామిక వేత్త)

## 'ఏ జాతీ ఒక విడి దీవి కాదు!'



"ఏ జాతీ విడి ద్వీపిగా జీవించలేదు. ఏ జాతినీ తక్కినవాటితో సంబంధం లేని ఒంటెత్తు జాతిగా భావించరాదు. ఏ ఆధ్యాత్మిక సిద్ధాంతానికీ ఇతర సిద్ధాంతాలతో పొత్తు లేకుండా లేదు. అన్ని జాతులూ కలిసి మెలిసి జీవిస్తూ ప్రపంచ మానవ జీవితాన్ని మెరుగుపరచడానికి కృషి చెయ్యాలి!"

—డా॥ ఎస్. రాధాకృష్ణన్

"సామ్రాజ్యాలూ, నాగరకతలూ బయటి శత్రువుల వల్ల కాదు; తమలోని హింసా ప్రవృత్తి వల్లనే పతనం అవుతాయి."—జవహర్‌లాల్ నెహ్రూ

# మీకు తెలుసా?

**సుదీర్ఘకాలం జైలు శిక్ష:**

అమెరికాలోని ఇండియానా జైలులో 66 ఏళ్ళ 127 రోజులు ఖైదీగా ఉన్న జాన్సన్ వాండైక్ గ్రిస్‌బీ యే ప్రపంచంలో మిక్కిలి ఎక్కువకాలం జైలు శిక్ష అనుభవించిన వ్యక్తి!

* * *

**మిక్కిలి సంక్షిప్తమైన వీలునామా:**

జెక్ భాషలో 'వ్సె జెనె' (vse zene_ అంతా భార్యకే) అనే రెండు మాటలతో వ్రాపిన వీలునామాయే ప్రపంచంలో మిక్కిలి సంక్షిప్తమైన విల్లు!

* * *

**రెండవ పెద్ద ద్వీపం:**

ఇండోనేషియా సమీపాన గల 'పాపువా న్యూగినియా' ప్రపంచంలోని మిక్కిలి పెద్ద ద్వీపాలలో రెండోది. జనాభాలో క్రైస్తవులూ, ఆదివాసులూ అధికంగా ఉన్న ఈ ద్వీపాన్ని గూర్చి బయటి ప్రపంచానికి ఎక్కువగా తెలియదు.

* * *

**సుదీర్ఘ కాలం సాగిన యుద్ధం:**

చరిత్రలో 1338 మొదలు 1453 వరకూ సాగిన నూరు సంవత్సరాల యుద్ధమే ప్రపంచంలో ఎక్కువ కాలం సాగిన యుద్ధం!

**టెన్నిస్ పోటీ చూడవచ్చిన మిక్కిలి పెద్ద గుంపు:**

అమెరికాలో ఆస్ట్రోడోమ్ (హూస్టన్)

(మిగతా 37 వ పేజీలో)

## ఇంజన్, డ్రైవర్ అక్కర లేని రైలు



ప. జర్మనీలో సిటీ సర్వీసులలో వాడడానికి ఒక క్రొత్తరకం 'అయస్కాంతపు రైలు' నమోనాను తయారు చేశారు. దీనికి చక్రాలు గాని, ఇంజను గాని, డ్రైవరు గాని అవసరం లేదు. విద్యుత్తంత్రుల ద్వారా సృష్టించబడిన ఒక అయస్కాంత క్షేత్రంలో రైలు పెట్టె అడుగున అమర్చిన అయస్కాంతమే రైలును నడుపుతుంది.

'సత్పరిపాలన ఉంటే ప్రజలకు ఎలాంటి స్వేచ్ఛలూ అక్కర లేదు." —సర్ వాల్టర్ రాలే

# కొత్తా నిలయటం ఎలా?

టి. వెంకటరావు

## 28

## వెలుగు నీడలు



ప్రకృతిలో మనం నిజంగా చూసేది వెలుగు నీడల కలయికనే! ప్రతి వస్తువుకీ ఒక వేపు వెలుగు, మరోవేపు నీడ కనిపిస్తాయి. వస్తువుకి దగ్గిరగా నేలమీద కూడా దాని నీడ పడుతుంది.

సూర్యుడు, దీపం, మంట మొదలైన వెలుగు నిచ్చే స్థానాల నుంచి వస్తువుల మీద వెలుగు ప్రసరిస్తుంది. పగటిపూట సూర్యుడి కిరణాలు నేరుగా సోకక పోయినా ఇంట్లో కూడా కొంత వెలుతురు ఉంటుంది. గాలి లోని ధూళి కణాలు ప్రతిఫలిత కాంతిని

## రెండు గుండెకాయలు ఉన్న వింత వ్యక్తి!

నేపిల్స్ (ఇటలీ) నగరంలోని గుయ్‌సెపీ డీమయ్ అనే వ్యక్తి రొమ్ము భాగంలో రెండు గుండెకాయలు పనిచేసేవి. యూరప్ లోని శాస్త్రవేత్త లందరూ ఈ వ్యక్తి విషయంలో విశేషాసక్తి చూపారు. 1894 లో 'లండన్ అకాడమీ ఆఫ్ మెడిసిన్' వారు మరణానంతరం అతని దేహాన్ని ఇచ్చేందుకు 15,000 డాలర్లు చెల్లించారు.

---

"ఎత్తు మనిషి గొప్పదనాన్ని నిర్ణయించలేనట్టే, జనాభా జాతి గొప్పను చాటదు." —విక్టర్ హ్యూగో



కొంతవరకూ ప్రసరిస్తూ ఉండడం ఇందుకు కారణం.

ఎప్పుడూ వెలుతురుకు ఎదురు వైపునే నీడ కనిపిస్తుంది. పైనుంచి వెలుతురు వస్తూ ఉంటే వస్తువు అడుగున నీడ ఉంటుంది. ఎడమనుంచి ప్రసరిస్తూ ఉంటే కుడివైపునా, కుడినుంచి ప్రసరిస్తూ ఉంటే ఎడమవైపునా నీడ పడుతుంది. కాంతి ఎంత ప్రకాశవంతంగా ఉంటే నీడ అంత గాఢంగా, నల్లగా ఉంటుంది. అది మందకొడిగా ఉంటే నీడ కూడా అలాగే ఉంటుంది. వస్తువు ఏ రూపంలో ఉంటే నీడ అదే రూపంలో ఉంటుంది.

కాంతి సూటిగా ప్రసరిస్తూ ఉంటే నీడ పొట్టిగాఉండడం,ఏటవాలుగా ప్రసరిస్తూ ఉంటే పొడుగ్గా ఉండడం మీరు గమనించవచ్చు.

కొందరు కార్టూనిస్టులు వెలుగు నీడలను తమ తమ ప్రత్యేక పద్ధతులలో సూచిస్తారు. కొందరు నీడలను అసలు సూచించనే సూచించరు. కొందరు వస్తువుల మీద నీడ పడే భాగాలను సూచించకపోయినా నేల మీద పడే వాటి తాలూకు నీడలను మాత్రం సూచిస్తారు. (సశేషం)

## మూడు గొప్ప సూక్తులు

"నిన్ను నువ్వు తెలుసుకో!" —సోక్రటీస్

"నిన్ను నువ్వు అదుపులో ఉంచుకో!" —మార్కస్ అరీలియస్

"నిన్ను నువ్వు అర్పించుకో!" —ఏసు క్రీస్తు

"అలవాట్లు ఆదిలో సాలెగూళ్ళు; అనంతరం అవి ఇనుప గొలుసులు."—స్పెయిన్ సామెత

# ఆదివాసుల వివాహాచారాలు

'వివాహం' అంటే ఒక స్త్రీ, ఒక పురుషుడూ ప్రేమానురాగాలతో కలిసి జీవిస్తూ సంతానాన్ని కని, పెంచి, పెద్ద చెయ్యడం. అయితే-ఇండియాలోని పలు ఆదిమవాసులలో వివాహాచారాలు విచిత్రంగా కనిపిస్తాయి.



'కూకి' జాతివారిలో ఒక పిల్లను వివాహమాడ దలచిన యువకుడు కొన్ని వారాలపాటు ఆ పిల్లతో కలసి వారి ఇంట్లో గడుపుతాడు. ఇద్దరి స్వభావాలూ పరస్పరం నచ్చితేనే వా రిద్దరూ వివాహం ఆడతారు. నచ్చని పక్షంలో ఆ యువకుడు ఆ కుటుంబాన్ని వదిలి తన దారిని తాను వెళ్ళిపోతాడు. అయితే అలా వెళ్ళిపోయే ముందు ఆ కుటుంబానికి అతడు కొంత పరిహారం చెల్లించుకోవలసి ఉంటుంది.

'గోండ్' జాతి వారిలో 'రాక్షస' వివాహం అమలులో ఉంది. 'రాక్షస' వివాహం అంటే-బలాత్కారంగా పిల్లను ఎత్తుకు పోయి పెళ్ళి చేసుకోడం. ఈ తంతు సాధారణంగా పండుగ రోజుల్లోనూ, భిన్న గ్రామాలవారి మధ్య జరిగే ఉమ్మడి సమావేశాలలోనూ జరుగుతూ ఉంటుంది. పిల్లను ఎత్తుకుపోవడంలో కృతకృత్యు డైన యువవీరుణ్ణి సంఘ పెద్దలు దీవిస్తారు. అయితే — పరిహారంగా కొంత సొమ్ము చెల్లించ మని గాని లేక అందరికీ విందు చెయ్య మని గాని వారు అతణ్ణి ఆదేశిస్తారు.

'బిర్‌హోర్' జాతి వారిలో ఆడపిల్లే ఒక యువకుణ్ణి వరించి, అతని కిష్టం ఉన్నా లేక

## హఠాత్తుగా కోటీశ్వరుడైన అనాథ బాలుడు

ఎరిక్ డేవిల్డ్ అనే 20 ఏళ్ళ లోపు అనాథ బాలుడికి క్రిందటేడు మార్చి నెలలో ఒక రోజున హాలీవుడ్ (ఫ్లారిడా - అమెరికా) ప్రాంతంలోని రైలుబాట ప్రక్కన చెల్లాచెదరుగా పడి ఉన్న వజ్రాలు పొదిగిన ఆభరణా లనేకం దొరికాయి. సుమారు కోటి రూపాయలు ఖరీదు చేసే ఆ ఆభరణాలను బుద్ధిగా అతడు పోలీసులకు వప్పగించాడు. అయితే - 6 నెలలు తిరక్కుండానే పోలీసులు 'ఫైండర్స్ కీపర్స్ లా' అనే చట్టం క్రింద ఆ ఆభరణా లన్నీ తిరిగి దేవిల్డ్ స్వాధీనం చేశారు.

"చాలా మంది చూపే కృతజ్ఞత మరి కొన్ని ఉపకారాలు పొందా లనే రహస్యమైన కోరికకు చిహ్నం!" -లారో చెఫోకాల్డ్

పోయినా బలాత్కారంగా అతణ్ణి చేపట్టే ఆచారం వాడుకలో ఉంది.

'భిల్' జాతి వారి వివాహం మరీ విచిత్ర



మైంది. పౌరుషానికీ, స్వతంత్ర ప్రవృత్తికీ పేరు మోపిన వారు భిల్లులు. హోలీ పండుగ సందర్భంలో కన్నె పడుచులు ఒక చెట్టుచుట్టూ వలయంగా నిలబడతారు. యువకులు వారి చుట్టూ మరో వలయంగా నుంచుంటారు. ఈ యువకులలో ఒకడు కన్నె పడుచుల వలయాన్ని ఛేదించుకొని వెళ్ళి చెట్టు ఎక్కి, చెట్టు కొసను ఉంచిన బెల్లం తిని, అక్కడి కొబ్బరికాయ పగులగొట్టాలి. కాని అలా ప్రయత్నించే వ్యక్తిని ఆ కన్నెపడుచులు అడ్డగిస్తారు. అతని వస్త్రాలు చింపి, జుట్టు పీకి చీపురు కట్టలతో కొడతారు. అయితే ఇదంతా ఒక సరాగంగానే జరుగుతుంది. చివరికి పోరాడు కొన్న ఆ జంటకు జరిగే వివాహంతో సంతోషంగానే ఆ తంతు పూర్తి అవుతుంది.

## 5 ఏళ్ళు వరుసగా టెన్నిస్ ఛాంపియన్

అయిదేళ్ళు వరుసగా ప్రపంచ టెన్నిస్ ఛాంపియన్ షిప్ గెలిచిన ఘనత బ్జోర్న్ బోర్గ్‌కు దక్కింది. 1973 నుంచి 1979 వరకూ వరుసగా ఆయనే ప్రపంచ ఛాంపియన్ అయారు. ఇంతకు ముందు (1880 లలో) ఇలాంటి ఘనత సాధించిన ఒకే క్రీడాకారుడు లిలీ రెన్‌షా!

(33 వ పేజీ తరువాయి)

వద్ద 1973 సెప్టెంబరు 20 న బిల్లీ జీన్ కింగ్ చేతిలో బాబీ రిగ్స్ ఓడిపోయిన టెన్నిస్ పోటీయే మిక్కిలి పెద్ద ప్రేక్షకుల గుంపును ఆకర్షించిన పోటీ!

* * *

టెన్నిస్ ఆటకు అంకురార్పణ :

1050 లో ఫ్రాన్స్‌లోని క్రైస్తవ మఠాలలో (monasteries) టెన్నిస్ ఆట మొదట ఆరంభం అయింది.

* * *

నేటి అగ్గిపుల్లను కనిపెట్టిందెవరు?

1855 లో జె ఇ. లండ్‌స్టన్ నేడు మనం వాడుక చేసే ప్రమాదరహిత మైన అగ్గిపుల్లలు మొదట తయారు చేశాడు.

* * *

ఐక్యరాజ్య సమితి బడ్జెట్‌కి అమెరికా విరాళం:

ఐక్యరాజ్య సమితి బడ్జెట్ మొత్తంలో 25 శాతం అమెరికా విరాళంగా ఇస్తూంది.

# నమ్మలేని నిజాలు

## 'రాబట్' మర మనుష్యులపై కూడా పన్ను:

జపాన్‌లో వివిధ కార్యాలు నిర్వర్తించే రాబట్ మర మనుష్యుల సంఖ్య నానాటికీ పెరుగుతూంది. అది చూసి కోమీటో పార్టీ ఆ మర మనుష్యుల నుంచి కూడా ప్రభుత్వం పన్ను వసూలు చెయ్యాలని ఒక తీర్మానం ప్రతిపాదించింది. ఔను మరి! కార్మికులు తమ సంపాదన మీద ఆదాయపు పన్ను చెల్లిస్తున్నప్పుడు వారి స్థానే పని చేసే 'రాబట్'లు మాత్రం చెల్లించ వద్దా?

## ఉపాధ్యాయుః కాపీ చేసే....?

మదురై కామరాజ్ యూనివర్సిటీ తాలూకు కరెస్పాండెన్స్ కోర్స్ డిగ్రీ పరీక్ష వ్రాస్తూ వేలూరు కేంద్రంలో ముగ్గురు మహిళలతో సహా 25 మంది ఉపాధ్యాయులు కాపీ చేస్తూ పట్టుబడ్డారు.

* * *

## ఆహారం అవసరం లేని వనిత:

మహారాష్ట్రలోని ఉస్మానాబాద్ జిల్లాలోని 22 ఏళ్ళ చతురాబాయ్ తోబారే అనే గ్రామీణ యువతి పుట్టిన నాటినుంచీ ఎన్నడూ ఆహారం తినలేదు. కేవలం పాలు లేవి తేనీరు బెల్లం వేసుకుని రోజుకి 4 లీటర్లు త్రాగుతుంది. ఎలాంటి అనారోగ్యం లేకుండా, నిక్షేపంగా ఆమె తన ఇంటి పనులు చక్కబెట్టుకుంటూంది.

*

## ఇండియాలో పట్టుబడిన మిక్కిలి పెద్ద 'షార్క్' చేప



ఇటీవల కేరళ తీరంలో అళికోడ్ వద్ద ఇండియా ప్రభుత్వం వారి 'ఎక్స్‌ప్లొరేటరీ ఫిషరింగ్ ప్రోజెక్టు' తాలూకు 'మత్స్య సుగంధి' అనే నౌకనుంచి మిక్కిలి పెద్ద షార్క్' చేపను పట్టారు. దీని పొడవు 302 సెం.మీ. లు; బరువు 235 కి.గ్రా. లు.

---

"కృతజ్ఞత ప్రదర్శించ వలసిందే కాని, దాన్ని డిమాండ్ చేసే హక్కు ఎవరికీ లేదు." —రూసో

## విచారణ జరుగకుండానే 37 ఏళ్ళు జైల్లో ఉన్న ఖైదీ!:

బ్రిటీష్ పరిపాలన నాటినుంచీ 'అండర్ ట్రయల్' (విచారణ పూర్తి కాని) ఖైదీగా ఉన్న బోకా ఠాకూర్ 37 ఏళ్ళ అనంతరం పాట్నా హైకోర్టు తీర్పు ననుసరించి ఇటీవల మధుబనీ జిల్లా సెంట్రల్ జైల్ నుంచి విడుదల అయాడు. 1945 జూలై 15 న అరెస్ట్ అయిన ఠాకూర్ కొన్నేళ్ళు జైల్లోనూ, మరి కొన్నేళ్ళు పిచ్చాసుపత్రిలోనూ గడిపాడు.

* * *

## ఇంటిని అక్షరాలా రెండు ముక్కలుగా కోసిన ఘనుడు:

న్యూజెర్సీలోని యూజినీ ష్నైడార్ 1976 జూలై నెలలో తన భార్య తనతో విడాకులకు దావా తెచ్చిన సందర్భంలో 80,000 డాలర్లు ఖరీదు చేసే తమ చెక్క ఇంటిని 'గొలుసు రంపం' (chain-saw) తో మధ్యకు రెండు ముక్కలుగా కోసి వేశాడు.

* * *

## 'సుజుకీ' వంశీయులనే ఎక్కించుకునే రైలు:

జపాన్‌లో వాకయామా మండలంలో ఒక రైలు కేవలం 'సుజుకీ' వంశీయులనే ఎక్కించుకుంటుంది. జపాన్ ప్రధానీ, మేయర్-ఇద్దరూ 'సుజుకీ' వంశీయులు. ఆ వంశీయుల కుటుంబాలు జపాన్‌లో సుమారు 20 లక్షల దాకా ఉన్నాయి. వారి కోసం ప్రత్యేకించబడ్డ రైలు అది.

## మూడు రోజులలో రెండు సార్లు మరణం:

70 ఏళ్ళ అంజాద్ ఖాన్‌ని లక్నోలోని బాల్‌రామ్‌పూర్ ఆసుపత్రిలో చేర్చారు. ఆ మరునాడు డాక్టర్లు ఆయన చనిపోయాడనీ, ఇంటికి తీసుకు వెళ్ళమనీ చెప్పారు. ఇంటికి తీసుకు వెళ్ళిన తరువాత ఆయన సజీవంగా ఉండడం చూసి మళ్ళీ ఆయనను ఆసుపత్రిలో చేర్చారు. ఆ తరువాత 3 రోజులకు రెండోసారి నిజంగా ఆయన మరణించారు.

* * *

## మ్యూజియంలో చోటు ఎద్దడి:

కలకత్తా మ్యూజియమ్‌లో చోటు ఎద్దడి వల్ల క్రీ.పూ. 3,000 నుంచి 18 వ శతాబ్ది దాకా వివిధ కాలాలకు చెందిన ఒక లక్ష అమూల్యమైన ప్రాచీన వస్తువులను ప్రదర్శించే అవకాశం లేకుండా పోతూంది. అక్కడ ఉన్న అమూల్యమైన వస్తువులలో కేవలం 10 శాతం మాత్రమే ఆ మ్యూజియమ్‌లో ప్రస్తుతం ప్రదర్శించబడుతున్నాయి. 

## గాలిలో ఎగిరిన తొలి సాహసులు

1783 లో ఇద్దరు ఫ్రెంచ్ వారు—ఫిలాటర్ డీ రోజీర్, మార్క్విస్ డీ ఆర్లండీస్ - వేడిగాలితో నింపిన బెలూన్ సాయంతో తొలిసారి గాలిలో ఎగుర గలిగారు. సుమారు 1,000 మీటర్ల ఎత్తు దాకా వారు వెళ్ళారు.

"బలమైన ప్రతిపక్షం లేని ప్రభుత్వానికి భద్రత లేదు." —బి. డిశ్రేలీ

# చమత్కారంగా మాట్లాడడం

ప్రొ॥ కె. ఆర్. బాలన్

ఇది నిజంగా జరిగిన కథ. తమిళనాడులోని తంజావూరు రాజ్యాన్ని కొన్నాళ్ళు 'శరోఫ్ జీలు' (మహారాష్ట్రులు) పాలించారు. 1900 వ సంవత్సరంలో పుణ్య పురుష లెందరో ఉన్నట్టుండి ఒక్కసారిగా ఆ నగరానికి విచ్చే శారు. ఆ సమయంలోనే కరపాత్ర భువా అనే సుప్రసిద్ధ యోగి ఒకరు తంజావూరు సమీప గ్రామంలో విడిది చేసి ఉన్నారు. తంజావూరు ప్రముఖ పౌరులలో ఒకరైన రుద్రశాస్త్రి తనవంటి భక్తులను మరి కొంద రిని చేర్చుకుని తంజావూరు విచ్చేసిన మహ నీయుల ఆలనా, పాలనా చూస్తూ ఉండేవారు. ఒక రోజున తంజావూరులో ఒకటి రెండు రోజులు విడిది చేసి అక్కడి వివిధ దేవా లయాలను సందర్శించా లనుకుంటున్నా నని కరపాత్ర భువా నుంచి ఆయనకు కబురు వచ్చింది. రుద్రశాస్త్రికి ఏమి చేయడానికీ పాలు పోలేదు. ఒక్క క్షణం మనస్సులో భగ వంతుణ్ణి ధ్యానించి తన మిత్రులతో సహా కరపాత్రభువా సందర్శనానికి బయలుదేరారు.

భక్తి ప్రపత్తులతో ఆ యోగికి నమ స్కారం చేసి, అంచులదాకా నిండుగా ఉన్న ఒక పాలకప్పును రుద్రశాస్త్రి ఆయన ముందు ఉంచారు. ఇంకొక్క పాలచుక్క వేసినా పొర్లిపోయేట్టు ఉన్న ఆ కప్పు ద్వారా తంజా వూరు నగరం పుణ్య పురుషులతో పూర్తిగా నిండి ఉన్న దనీ, మరి ఒక్క స్వామీజీకి కూడా అక్కడ ఎలాంటి అవకాశం లేదనీ కరపాత్ర భువాకు వ్యంగ్యంగా సూచించడం రుద్రశాస్త్రి ఆశయం. ఆ రోజులలో స్వామీ జీలు గృహస్థుల ఇండ్లకు అతిథులుగా వచ్చే వారు కారు. వారి పూజా పురస్కారాలకు ప్రత్యేకంగా బసలు ఏర్పాటుచేయవలసివచ్చేది.

---

## సైనిక శిబిరంగా ఉపయోగించిన మర్రిచెట్టు



ఇండియాలో మర్రిచెట్లు 320 ఊడల దాకా దింపి, దాదాపు 2,000 చ.అ ల మేర వ్యాపించగలవు. అలెగ్జాండరు తన 7,000 మంది సైనికులకూ అలాంటి ఒక పెద్ద మర్రిచెట్టునే సైనిక శిబిరంగా వాడుకున్నట్టు చారిత్రకులు చెబుతున్నారు.

"బలం ఉండడం గొప్ప కాదు; దానిని సక్రమంగా వినియోగించడమే గొప్పతనం!" — హెచ్. డబ్ల్యు. బీచర్

సూక్ష్మంగా, అతి మర్యాదగా రుద్రశాస్త్రి సూచించిన ఇబ్బందిని ఆ యోగి గ్రహించారు. వెను వెంటనే ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా ఒక గులాబీరేకును ఆయన ఆ కప్పులో పడవేశారు. అది ఆ పాలమీద తేలుతూంది. ఆ కప్పును రుద్రశాస్త్రికి ఇచ్చారు. మరో పాలచుక్కకు కూడా ఆ కప్పులో అవకాశం లేకపోయినా, ఒక గులాబీ రేకు దాని మీద తేలగలిగినట్టుగానే ఎంతగా మహాత్ములతో నిండి ఉన్నా, తనకు కూడా తంజావూరులో అవకాశం ఉండక పోదని ఆ యోగి ఆ చర్య ద్వారా రుద్రశాస్త్రికి తెలిపారు.

త్వరలోనే శర్ఫోజీ మహారాజ్‌కి ఆయన రాకను గూర్చి కబురు వెళ్ళడం, కరపాత్రభువాకు తగిన బస ఏర్పాటు చేసి నగర సరిహద్దులలో స్వామీజీకి స్వాగతం చెప్పి తోడ్కొని వచ్చేందుకు తన అమాత్యులలో ఒకరిని ఆయన నియోగించడం జరిగింది.

నర్మ గర్భంగా, చమత్కారంగా అభిప్రాయాన్ని ప్రకటించే పద్ధతికి అద్భుతమైన దృష్టాంతం ఇది. ఇలా చిత్రంగా వ్యంగ్య ధోరణిలో భావ ప్రకటన చేసుకునే సన్నివేశాలు ఇండియాలోనే ఎక్కువగా కనిపిస్తాయి. మాట తనకు శక్తి ఉన్న అర్థాన్ని మాత్రమే బోధించగలదు. అందుకే మాటల ఎన్నికలో జాగరూకత వహించడం, తూచి తూచి మాట్లాడడం అవసరం.

ఇలాంటిదే మరో అద్భుతమైన సన్నివేశం చెబుతాను:

కీర్తిశేషుడైన అమెరికన్ అధ్యక్షుడు కెన్నెడీ అణ్వస్త్ర నిషేధాన్ని గూర్చి, ప్రపంచంలో శాంతి సాధనను గూర్చి చర్చించడానికి సుప్రసిద్ధుడైన భారతీయ మేధావి రాజాజీని ఆహ్వానించారు. వైట్ హౌస్‌లో మూడు గంటల పైచిలుకు ఇద్దరి మధ్యా చర్చలు జరిగాయి. చర్చల అనంతరం గురువు వెంట వచ్చే విద్యార్థి లాగ కెన్నెడీ రాజాజీ వెంట క్రిందికి దిగి వచ్చారు. ప్రపంచంలో వివిధ దేశాల నుంచి వచ్చిన పత్రికా విలేఖరులు వారి రాక కోసం ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారు. వారిలో చురు

(మిగతా 45 వ పేజీలో)

## యూరప్‌లోని మిక్కిలి పెద్ద సౌర విద్యుత్ కేంద్రం



'నార్త్ సీ' లోని ద్వీపం 'పెల్‌వర్మ్'లో నిర్మిస్తున్న యూరప్ అంతటిలోకీ పెద్ద సౌర విద్యుత్ కేంద్రం త్వరలోనే పని చేయడం ఆరంభిస్తుంది. 300 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి అక్కడ ఉత్పత్తి కాగలదు.

"గొప్పదనం కోరే వాడు సత్యాన్ని అన్వేషించాలి;
అప్పుడు రెండూ అతనికి లభిస్తాయి!" — హెచ్. మన్

# బహుమతి పొందిన వ్యాసం

# వినోద యాత్రలు

వి. పి. నర్సింహారెడ్డి, గుంటూరు.

మన దైనందిన కార్యకలాపాల నుంచీ, యాంత్రిక జీవనం నుంచీ దూరంగా వెళ్ళి స్వేచ్ఛగా, ఆనందంగా గడపడమే వినోద యాత్రల ప్రధాన లక్ష్యం. ప్రయాణ సౌకర్యాలు ఎక్కువగా లేని వెనుకటి రోజుల్లో ఎక్కడి వా రక్కడే తీరిక సమయాలలో వినోద కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండే వారు.

నేడు వినోద యాత్రలపట్ల ప్రజలలో ఆసక్తి పెరిగి తమ తమ దేశాలలోని వివిధ ప్రాంతాలను సందర్శించడమే గాక, విదేశాలకు కూడా వినోద యాత్రలు చేస్తున్నారు. విభిన్న ప్రాంతాలలోని ప్రజల ఆచార వ్యవహారాలనూ, జీవన విధానాలనూ గమనిస్తూ లోక జ్ఞానాన్ని పెంపొందించు కుంటున్నారు. ప్రపంచంలోని అన్ని దేశాల ప్రభుత్వాలూ దేశీయ, విదేశీయ యాత్రికుల కోసం ఎన్నో సౌకర్యాలు కల్పిస్తున్నాయి. మన ప్రభుత్వం కూడా ఎంతో డబ్బు ఖర్చు పెట్టి వినోద యాత్రికులను ఆకర్షించే స్థలాలను అభివృద్ధి చేస్తూంది.

వినోదయాత్రల వల్ల మనుష్యులు మరింత

## పెద్ద వజ్రంతో మెరిసే గోపుర స్తంభం



సౌదీ అరేబియా రాజధాని నగర 'రియాద్'లో 173 మీటర్ల ఎత్తున్న పోస్టాఫీస్ గోపురం మీది పెద్ద వజ్రంతో కూడి[illegible] స్తంభం ధగధగ మెరుస్తూ చూపరుల దృష్టి[illegible] ఆకర్షిస్తుంది. పశ్చిమ జర్మన్ కంపెనీల చే[illegible] ఇటీవల నిర్మించబడిన టెలివిజన్ సెంటర్[illegible] మధ్యలో ఉంది ఈ స్తంభం. 'సీమెన్స్' ఎల[illegible]క్ట్రానిక్ కంపెనీ వారు ఆ భవనంలో 22,[illegible] దీపాలు అమర్చారు.

"సంభాషణలలోని మధురోక్తులే
మన మనుగడకు సొగసు నిస్తున్నాయి!" -ఓ. హెన్రీ

రవుతారు. సంకుచిత భావాలు నశించి గాల దృక్పథం కలుగుతుంది. "మానవు తా ఒకటే, అందరి కష్టసుఖాలూ టే!" అన్న భావం ఏర్పడి విశ్వమానవ యస్సుకు అంతా దీక్షతో కృషి చేస్తారు.

వినోద యాత్రల వల్ల జీవితంలో ద్ధిత, ఒంటరితనం పోయి యాంత్రిక రనం వల్ల కలిగే విసుగు, చిరాకు తగ్గి నో వికాసం కలుగుతుంది. మళ్ళీ ద్విగుణీ త్సాహంతో తమ దైనందిన కార్యకలాపా లో వారు పాల్గొనగలుగుతారు. తాము కూపస్థ ండూకాలు కాదనీ, తమ జీవిత లక్ష్యం ర్థాన్ని సాధించడం కాదనీ, ప్రతి వ్యక్తి క విరాట్ పురుషుడు లాంటి వాడనీ గుర్తి రు. వినోద యాత్రలను ప్రోత్సహించడం ానవజాతి సామరస్యంతో సుఖ శాంతు తో విరాజిల్లడానికి దోహదం చేస్తుంది.

* * *

ఋ. వి. సుబ్రహ్మణ్యం,
యల్ పాడు, చిత్తూరు జిల్లా.

మానసిక ఆరోగ్యానికీ, ఉల్లాసానికీ నోదయాత్రలు ఎంతైనా అవసరం. అయితే కు వినోదయాత్రలు ధనవంతుల విలాసా కే పరిమితమై పోవడం శోచనీయం. మధ్య గతి మానవునికి వినోద యాత్ర అంటే హాంతర యానమే! సినీమా చూడా లనే రికనే నెల జీతం వచ్చేవరకూ వాయిదా కోవలసి వచ్చే సామాన్య జనులకు నోదయాత్ర మాట తలుచుకుంటేనే విషాదం గుతుంది.

సంవత్సరానికి ఒక్కసారి కాశ్మీరు, కన్యాకుమారి కాకపోయినా చుట్టుపక్కల ఉన్న చరిత్రాత్మక స్థలాలకైనా వెళ్ళిరావడం అవసరం. విద్యార్థిదశలో పెద్దవాళ్ళను ఎలాగో ఒప్పించి ఎక్స్కర్షన్ పేరుతో తిరిగి వచ్చిన యాత్రల తాలూకు స్మృతులతోనే జీవితం అంతా గడపవలసి వస్తుంది. లేదా పెళ్ళైన క్రొత్తల్లో అత్తవారిని ఏడిపించి ఒక హనీ మూన్ ట్రిప్ వేస్తే ఆ విలాస యాత్రనే

## ఏటా అమెరికన్ అధ్యక్షుడు పంపే తరాలు



అమెరికన్ అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ ఏటా 99,000 ఉత్తరాల మీద సంతకాలు చేస్తారు. రోజూ ఆయన అందుకునే ఉత్త రాలు సుమారు 15,000. ఆయన కరె స్పాండెన్స విభాగంలో సుమారు 50 మంది పని చేస్తున్నారు. అధ్యక్షుడు స్వయంగా వ్రాసే ఉత్తరాలు ఏటా 1,000 దాకా ఉంటాయి.

"ఇతరులు మనల్ని చూపినట్టు మనల్ని మనం చూసుకోవాలి!" —ఆర్. కె. కరంజియా

వినోద యాత్రగా సరిపెట్టుకోడం జరుగుతూంది.

వినోద యాత్రలు అందరికీ అందుబాటులో ఉండాలంటే పెరిగిన రైలు ఛార్జీలు తగ్గాలి. తక్కువ చార్జీలకు బైరాగి టికెట్ల లాంటివి ఇవ్వాలి. ఇలాంటి యాత్రలకు ఆఫీసుల వారు అడ్వాన్సు ఇవ్వాలి. యాత్రా స్థలాలలో చౌకగా గృహవసతి, తిండి సౌకర్యం లభించేట్టు చూడాలి.

* * *

కె. శేషావతారం,

బెల్లంపల్లి, (ఆదిలాబాద్ జిల్లా)

నిత్య జీవితంలో ప్రతి వ్యక్తి ఏవో సంసారపు చిక్కులు ఎదుర్కొంటూ, మనస్సుకు విశ్రాంతి లేకుండా బాధ పడుతూ ఉంటాడు. సాధారణంగా అలాంటి వారికి సెలవు రోజులూ, పండుగ రోజులూ మాత్రమే కొంత విశ్రాంతిని చేకూరుస్తాయి. వా రోజులు తీరిక లేకుండా పని చేసి విసు చెందిన వ్యక్తి ఆ వాతావరణానికి దూరం తోట విందులూ మొదలైనవి చేసుకుం ఉండడం అవసరం. వారాంతాలలో జరు కునే ఇలాంటి పిక్నిక్‌లను కూడా వినో యాత్రలుగానే పరిగణించవచ్చును

ద. భారత దేశంలో నీలగిరి ఊ మండలం, మహాబలిపురం, తిరుపతి, నా ర్జున సాగర్ వంటి సుప్రసిద్ధ వినోద యా స్థలాలు ఎన్నో ఉన్నాయి. ఈ స్థలాల స ర్శనం వల్ల వినోదంతో పాటు మనకు విజ్ఞా కూడా లభించగలదు

(42 వ పేజీ తరువాయి)

కైన ఒక విలేఖకుడు అమిత గౌరవంతో రాజాజీని సమీపించి, "ఫలప్రదం అయాయా సార్?" అని ప్రశ్నించాడు. తడుముకోకుండా వెంటనే రాజాజీ తన విశిష్ట ధోరణిలో ఇలా అన్నారు. "పుష్పప్రదం అయాయి! నాయనా!" అంత వ్యంగ్యంగానూ, ఇమిడికగానూ తన భావాన్ని ప్రకటించడం ఒక్క రాజాజీకే చెల్లును!

ప్రయత్నిస్తే - మన దేశంలోని మహనీయులైన స్త్రీ, పురుషుల జీవితాల నుంచి ఇలాంటి చమత్కార భరిత మైన సన్నివేశాల నెన్నిటినో మనం సేకరించవచ్చు.

## మోటార్ సైకిల్ ఫీట్!



క్రిస్ బ్రోమ్‌హామ్ అనే 26 ఏళ్ళ యువకు బ్రిటన్‌లోని 'బ్రోమ్‌లీ'లో ఇటీవల తన '4 సిసి మోటో-క్రోస్' మోటార్ సైకిల్‌పై గాలిలో పైకి లేచి, వరుసగా నిలబడి ఉ 8 డబుల్ డెకర్ బస్సులమీదుగా 59. మీటర్ల దూరం లంఘించాడు.

"తలలు బోడులైన తలపులు బోడులా?" —వేమన

# నిజాలు-నిదర్శనాలు

## ఇండియా రక్షణ వ్యయం పెరుగుదల:

1982-83 బడ్జెట్ అంచనాలను అనుసరించి ఇండియా రక్షణ శాఖలో 4 రోజుల 8 గంటలలో అయే వ్యయం ఒక ఏడాదిలో గృహ నిర్మాణం క్రింద అవుతున్న వ్యయంతో సమానం!

## ఇండియాలో బాల కార్మికులు:

అభివృద్ధి చెందిన దేశాలలో యుక్త వయస్సు రాని పిల్లలలో కేవలం 3 శాతమే పనులుగా ఉంటే, వర్ధమాన దేశాలలో నిష్పత్తి 6 శాతం. అయితే—ఇండియాలో మాత్రం బాల కార్మి. 20 శాతం!

## పుష్టికర మైన ఆహారానికి నోచుకోని అభాగ్యులు:

ఐక్యరాజ్య సమితి తాలూకు నిపుణుల బృందం అందజేసిన భోగిట్టా ననుసరించి ఈనాడు ప్రపంచంలో పుష్టికర మైన ఆహారానికి నోచుకోని అభాగ్యులు 60 కోట్ల మంది ఉన్నారు. 150 కోట్ల మందికి వైద్య సదు

## ఒకే అద్దం గల మిక్కిలి పెద్ద టెలిస్కోపు



టెక్సాస్ (అమెరికా) లోని 'ది స్టేట్ యూనివర్సిటీ' వారు టెక్సాస్ పశ్చిమ ప్రాంతంలో ఉన్న మేక్‌డొనాల్డ్ వేధశాలలో 1989 నాటికి ఒకే అద్దం గల మిక్కిలి పెద్ద టెలిస్కోప్‌ను అమర్చేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. 300 అం. ల కొలత గల ఈ టెలిస్కోప్ మౌంట్ పాలమోర్ వద్ద గల 200 అం. ల టెలిస్కోప్‌కంటె 2¼ రెట్లు ఎక్కువ కాంతిని గ్రహించగలదు. కాంతి శాస్త్రం (optics) లో వచ్చిన ఇటీవలి అభివృద్ధివల్ల అంతకంటె మరింత స్ఫుటమైన బింబాలను ప్రదర్శించగలదు.

"అందం మన లోపలా లేదు, వెలుపలా లేదు:
పరమాత్మతో మన అనుబంధంలో ఉంది!" -పాస్కల్

పాయం లేదు. 25 కోట్ల మంది పిల్లలకు విద్యా సౌకర్యం లేదు.

* * *

## వ్యవసాయంలో విద్యుచ్ఛక్తి వాడకం:

| | |
|---|---|
| 1950 లో | 3.9 శాతం |
| 1970 లో | 10 శాతం |
| 1981 లో | 20 శాతం |
| ప్రస్తుతం కొన్ని రాష్ట్రాలలో | 40 శాతం |

* * *

## జనాభా - భూ విస్తీర్ణం:

రష్యాతో సహా 10 రాజ్యాలలో ప్రపంచ జనాభాలోని 62 శాతం మంది జీవిస్తున్నారు. ఈ 10 రాజ్యాల భూ విస్తీర్ణం 38 శాతం మాత్రమే! రష్యా మినహా తక్కిన 9 రాజ్యాల జనాభా 57 శాతం కాగా, భూ విస్తీర్ణం 25 శాతం!

* * *

## ఇండియాలో కుష్ఠు రోగులు:

ఇండియాలో ప్రస్తుతం దాదాపు 40 లక్షల మంది దాకా కుష్ఠు రోగులు ఉన్నారు. వారిలో సగం మందికి మాత్రమే చికిత్స అందుతూంది.

* * *

## జనాభా - శక్తి వనరులు:

బొగ్గు, పెట్రోలు, గ్యాస్, విద్యుచ్ఛక్తి వంటి వనరులలో నాలుగో వంతు అమెరికాలో ఉన్నాయి. శక్తి వనరులలో 49.3 శాతం అమెరికా, రష్యా, సౌదీ అరేబియా అనే మూడు రాజ్యాలలోనే నిక్షిప్తం అయి

## మిక్కిలి ఎక్కువ సర్క్యులేషన్ గల దిన పత్రిక



ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ సర్క్యులేషన్ ఉన్న వార్తా పత్రిక జపాన్‌లోని 'యోమ్యూరీ షింబున్'. ఉదయం ఎడిషన్, సాయంత్రం ఎడిషన్ కలిపి ఆ పత్రిక 1.36 కోట్ల కాపీలు ఖర్చవుతూంది. ఇవి కాక, ఇంగ్లీషు ఎడిషన్ 30,000 కాపీలు ఖర్చవుతున్నాయి. అమెరికాలోని 17 పెద్ద దిన పత్రికల మొత్తం సర్క్యులేషన్ కలిపినా 1874 లో స్థాపించబడిన ఈ పత్రిక సర్క్యులేషన్‌ని మించలేవు. 24 మొదలు 32 పుటల దాకా ఉండే ఈ పత్రికను ముద్రించి, జపాన్‌లోని 3.4 కోట్ల కుటుంబాలలోను 38 శాతం కుటుంబాలకు అందజేయడంలో మొత్తం 3,059 మంది పనిచేస్తున్నారు.

---

"న్యాయంగా బ్రతికే వ్యక్తి మౌనం ఇతరుల వాగ్ధాటి కంటె ఎక్కువ శక్తి గలది." —బ్రూక్స్

ఉన్నాయి. ప్రపంచ జనాభాలో వాటి జనాభా 11.9 శాతం మాత్రమే!

## ప్రాథమిక విద్యలో ఇండియా అగ్రస్థానం:

ఇండియాలో ప్రాథమిక పాఠశాలలు 6 లక్షలు ఉన్నాయి. ఈ అంశంలో ప్రపంచంలో ఇండియాదే అగ్రస్థానం. అయితే అక్షరాస్యుల శాతం దృష్ట్యా ప్రపంచ రాజ్యాలలో ఇండియా 120 వది!

(20 వ పేజీ తరువాయి)

## బ్యాండ్‌మీద అదే వాయిస్తున్నారు!

కొత్తగా కోటీశ్వరుడైన వ్యక్తి ఒక ఖరీదైన రెస్టారెంట్‌కు వెళ్ళాడు. తన అజ్ఞానం ఎవ్వరికీ తెలియనివ్వరాదని జాగ్రత్తగా అతడు వెయిటర్‌కి మెనూ కార్డ్ మీద ఒక పంక్తి చూపించి 'నాకు ఇది కావాలి!' అన్నాడు.

వెయిటర్: సారీ! బ్యాండు మీద ఇప్పుడు వాళ్ళు అదే వాయిస్తున్నారు సార్!

* * *

## జడ్జికీ, దంత వైద్యుడికీ ఉన్న సామ్యం:

జడ్జికి పూర్తి 'ట్రూత్' (సత్యం) కావాలి. దంత వైద్యుడికి పూర్తి 'టూత్' (పన్ను) కావాలి!

## ఇండియన్ కంపెనీలకు విదేశీ కంపెనీలతో అనుబంధం:

1979 నుంచి 1981 వరకూ గల 3 ఏళ్ళలోనూ భారత ప్రభుత్వం 1182 విదేశీ కంపెనీలకు ఇండియన్ కంపెనీలతో అనుబంధాన్ని ఆమోదించింది. ప్రస్తుతం ఇండియన్ కంపెనీలతో సహకరిస్తున్న విదేశాల వివరాలు:

| | | |
|---|---|---|
| అమెరికా | 258 | కంపెనీలతో |
| బ్రిటన్ | 252 | |
| ప. జర్మనీ | 229 | |
| జపాన్ | 73 | |
| ఫ్రాన్స్ | 64 | |
| ఇటలీ | 59 | |

## హైకోర్టు ఉన్న ఒకే కేంద్రపాలిత రాష్ట్రం




ఇండియాలోని 9 కేంద్రపాలిత రాష్ట్రాలలోనూ ఒక్క 'ఢిల్లీ'కి మాత్రమే ప్రత్యేకంగా హైకోర్టు ఉంది.

"నిజంగా మహావీరులనదగిన వారు ఎంత ఎక్కువగా ఉంటే ఆ జాతి అంత గొప్పది!" —సింక్లేర్ లీవిస్

# విలువైన లోహాలు

డా॥ ఎన్. కృష్ణమూర్తి



[డా॥ ఎన్. కృష్ణమూర్తి (జననరి 1933 డిసెంబరు 12) ఆంధ్రా యూనివర్సిటీలో చదివి ఎం.ఎస్‌సి, పి హెచ్.డి పట్టాలు పొందారు. ఇవి కాక లండన్ మొదలైన యూనివర్సిటీల నుంచి ఇంకా ఎన్నో డిగ్రీలు ఆయన సంపాదించారు. ప్రస్తుతం ఆంధ్రా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కాలేజిలో ఇంజనీరింగ్ కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్ అధిపతిగా పని చేస్తున్నారు. మొత్తం 60 పైచిలుకు పరిశోధక వ్యాసాలను ప్రామాణికమైన సైన్స్ పత్రికలలో ఆయన ప్రకటించారు.]

బంగారం, వెండి, ప్లాటినమ్—వీటిని విలువైన లోహాలు, లేదా, 'నోబుల్ మెటల్స్' అంటారు. గాలి, నీరు, ఆమ్లములు ఇతర రసాయనాలు ఈ లోహాలలో ఎలాంటి మార్పునూ తేలేవు కనుక ఇవి విలువైన లోహాలుగా ప్రసిద్ధి పొందాయి. ప్రతి దేశానికీ ఈ లోహాల ఉనికి ఆర్థిక సంపదగా పరిగణించబడుతూంది.

అతి ప్రాచీన కాలంనుంచీ మానవుణ్ణి ఆకర్షించిందీ, ఇక్కట్ల పాలు చేసిందీ బంగారమే: కొన్ని వేల సంవత్సరాల క్రితమే సువర్ణ, రజతముల ప్రస్తావన మన వేదాల్లోనూ, బైబిల్‌లోనూ కనిపిస్తూంది. క్రీ.శ. 200 నాటికే ఈజిప్ట్ ప్రజలు లిబియా గనుల నుంచి బంగారం తవ్వి తీశారు. మట్టి నుంచి ప్రతి 100 టన్నులకూ ½ గ్రామూ, సముద్ర జలం నుంచి ప్రతి టన్నుకీ 0.1 గ్రామూ బంగారం లభిస్తుంది. ప్రతి సంవత్సరం ప్రపంచంలో దాదాపు 6 లక్షల కిలోల

## బ్రెజిల్ భాషలో వాత్స్యాయన కామసూత్రాలు

బ్రెజిల్ భాషలో 'వాత్స్యాయన కామసూత్రాల' తాలూకు 83 వ ముద్రణ ఇటీవల వెలువడింది. ఇంగ్లీష్ నుంచి బ్రెజిల్ భాషలోకి అనువదించబడిన ఈ గ్రంథం ఇండియాలో కంటె కూడా బ్రెజిల్‌లో ఎక్కువ ప్రజాదరణ చూరగొన్నదని లాటిన్ అమెరికన్ సంస్కృత సంఘం అధ్యక్షుడు కార్లోస్ ఆల్బెర్టో డా ఫోన్సెకా అన్నారు.

"ఎక్కువ మందికి ఎక్కువ మేలు కలిగించేది 'మంచి';" —జె. బెంథామ్

బంగారం ఉత్పత్తి అవుతూంది. దీనిలో 50 శాతం దక్షిణ ఆఫ్రికాలోనూ, 16 శాతం అమెరికాలోనూ లభిస్తూంది. ఇంకా కెనడా, రష్యా, ఆస్ట్రేలియాలలో కూడా బంగారం లభిస్తూంది మన దేశంలో లభించే బంగారం 2 శాతం మాత్రమే! బంగారం ఉత్పత్తి చేసే దేశాలలో మన దేశానిది 18వ స్థానం. మన దేశంలో 99.9 శాతం బంగారం కర్నాటక లోని కోలార్ గనుల్లోనే లభ్య మవుతూంది.

సృష్టిలో గల లోహా లన్నిటిలోనూ ఒక్క బంగారం మాత్రమే స్వతస్సిద్ధమైన లోహంగా లభ్య మవుతూంది. సాధారణంగా బంగారం ఇసుకతోనూ, క్వార్ట్సుతోనూ కలసి నదీగర్భాల లోనూ, కొండ చరియలలోనూ దొరుకు తుంది. ఇది కాక వెండి, రాగి, బిస్మత్, సీసం, జింక్ మొదలైన ఖనిజాలతో కలసి కూడా బంగారం లభిస్తూంది. ఇసుక లేక క్వార్ట్సుతో కలసి దొరికిన బంగారం పొడిని నీటిలో కడిగి వేరు చేస్తారు. తరువాత దాన్ని పాదరసంతో కలిపి వేడిచేస్తే, బంగారం అడుగున మిగిలి, పాదరసం ఆవిరి అయిపోతుంది. 100 శాతం మేలిమి బంగారాన్ని 24 కేరట్స్ అనీ, కాసుల బంగారాన్ని 22 కేరట్స్ బంగారం అనీ అంటారు. కాసుల బంగారంలో తక్కిన 2 పాళ్లూ రాగి చేరుతుంది.

వెండి దక్షిణ అమెరికా, మెక్సికో, కెనడా లలో హెచ్చుగా లభ్య మవుతూంది. స్వల్పంగా బంగారంతో కూడా కలసి లోహరూపంలో దొరికినా, సిల్వర్ సల్ఫేట్, సిల్వర్ క్లోరైడ్, రాగి, సీసం, జింక్ ఖనిజాలలోనే హెచ్చుగా ఇది లభిస్తూంది. ప్రపంచంలో దొరికే మొత్తం వెండిలో 50 శాతం ఫొటోగ్రఫీ పరిశ్రమకే వినియోగపడుతూంది. ఖనిజాలను సిల్వర్ సైనేడ్‌తో కలిపిన మిశ్రమంలోకి గాలిని పంపి జింక్‌ను కలపడంవల్ల జింక్ సిల్వర్ మిశ్రమం వస్తుంది. ఆ మిశ్రమ లోహాన్ని వేడిచేస్తే వెండి మిగిలి, జింక్ ఆవిరి అయిపోతుంది. దీన్నికూడా బంగారం లాగే శుద్ధిచేస్తారు. మన దేశంలో కోలార్ లోనూ, రాజస్థాన్, బీహార్ రాష్ట్రాలలోనూ వెండి లభిస్తూంది.

---

## అరటి చెట్టు విశిష్టత



కలపతో కూడిన మొదళ్లు లేని చెట్లలో ప్రపంచంలో అరటి చెట్టే పెద్దది. ఇది దాదాపు 30 అ.ల ఎత్తు దాకా ఎదుగుతుంది. ఆరంభంలో అరటి రకా లన్నిటిలోనూ విత్తనాలు ఉండేవి. కాని, కొన్ని వేల ఏళ్ళ సాగు అనంతరం విత్తనాలు పూర్తిగా అంతరించి ఇప్పుడు వేరు భాగం నాటడం వల్లనే కొత్త మొక్కలు మొలుస్తున్నాయి.

"గతాన్ని మార్చడం దేవుడి తరం కూడా కాదు." —అగాథన్

ప్లాటినమ్ బంగారం కంటె ఎక్కువ ఖరీదైన లోహం. 1730 లో ఇది మొదట కనుగొనబడింది. బంగారంలో దీన్ని కలుపుతున్నారనే ఆరోపణతో స్పానిష్ ప్రభుత్వం ఈ లోహాన్ని నిషేధించి, దానిని సముద్రంలో పారవేయాలని ఆజ్ఞ జారీ చేసింది. ఈ లోహాన్ని 1735 లో ఛార్లెస్ వుడ్ యూరప్‌కు తీసుకు వచ్చినట్లు తెలుస్తూంది. అనంతరం రష్యా దక్షిణాఫ్రికాలలో ఈ లోహం కనుగొనబడింది. 1876 నాటికి విలువైన లోహంగా దీనికి పరిగణన లభించింది. బంగారం లాగే ఇది ఎక్కువగా సహజ రూపంలో లభించినా అక్కడక్కడ ఒస్మిరిడియమ్, పళ్ళాడియమ్ మిశ్రమాలతో కలిసి కూడా లభిస్తూంది. బంగారం లాగే ఇసుక నుండి నీటితో వేరుచేసి హైడ్రోక్లోరిక్, నైట్రిక్ ఆసిడ్ మిశ్రమమైన ఆక్వా రీజియాతో కలిపి ఫెర్రస్ సల్ఫేట్, అమ్మోనియం క్లోరైడ్‌లతో కరిగించడం వలన ప్లాటినం వస్తుంది.

బంగారం పసుపు వర్ణంగానూ, వెండి, ప్లాటినమ్ తెల్లగానూ ఉంటాయి. బంగారం 1062° సి, వెండి 960° సి, ప్లాటినమ్ 1750° సి ఉష్ణోగ్రతల వద్ద కరుగుతాయి. బంగారం సల్ఫ్యూరిక్, నైట్రిక్ ఆమ్లములతో కలవదు. బంగారాన్ని పరీక్ష చేయడానికి ఆక్వా రీజియాలో కరిగించి దానిని బెంజడీన్ ద్రావకంలో వేస్తే నీలం రంగూ, సోడియం హైడ్రాక్సైడ్‌లో వేస్తే పసుపు రంగూ వస్తాయి.

బంగారాన్ని ఔషధాలతో వాడుతారు. వెండితో కలిపి బంగారాన్ని అంతరిక్ష యానాలలోని యంత్రాలకు అపాయకరమై రేడియేషన్స్ తగులకుండా వాడుతున్నారు. బంగారు వస్తువుల మీద పేరుకొనే గ్రీజ్ మన్ను వేడి సబ్బు నీటితోనూ, మెత్తటి బ్ర తోనూ కడిగితే పోతుంది లేదా ఫెరి ఆక్సైడ్ పూత గల పోలిషింగ్ క్లాత్‌తో తుడిచినా మెరుగు వస్తుంది.

నాణేలకూ, నగలకూ, వెండి పూతకూ మందుల్లోకీ, మార్కింగ్ ఇంక్‌లకూ, తల వేసుకునే రంగుల తయారీకీ వెండి ఉపయో పడుతూంది. సిల్వర్ నైట్రేట్, అమ్మో

## సూర్యుని చుట్టూ ప్లూటో గ్రహ పరిభ్రమణం




సౌర కుటుంబంలో సూర్యునికి మిక్కి దూరంగా ఉన్న కక్ష్యలో పరిభ్రమించే చి గ్రహం ప్లూటో. 1930 లో దీనిని క గొన్నారు. సూర్యుడికి 500 కోట్ల కి.మీ. దూరంగా అది తిరుగుతూంది. ఇది వ అనుకుంటూ వచ్చినంత పెద్ద గ్రహం కాద దాని వ్యాసం 6,000 కి.మీ.లు కాక 3,9 కి.మీ. లు మాత్రమే అని ఇప్పుడు భావి న్నారు. సూర్యుడి చుట్టూ ఒకసారి తి రావడానికి ప్లూటోకు 248 సం.ల కాలం ప తుంది.

"ప్రత్యక్షంగా కనిపించే దేవుడు 'బంగారం'." —పి. బి. షెల్లీ

యమ్ హైడ్రాక్సైడ్, ఫార్మాలిన్‌ల మిశ్రమాన్ని అద్దాలకు పూత పూయడానికి ఉపయోగిస్తారు. ప్రకాశవంతంగా ఉన్న అల్యూమినియమ్ పాత్రలో ఒక లీటరు నీరు పోసి ఒక చెంచాడు సోడియం బైకార్బనేట్, ఒక చెంచాడు ఉప్పు వేసి దానిలో వెండి వస్తువును ఉంచి మరిగించిన తరువాత మంచినీటితో కడిగి నూలువస్త్రంతో తుడిస్తే వెండి వస్తువులకు మెరుగు వస్తుంది. వెండికి గంధకంతో కూడిన పదార్థాలు కాని, రబ్బరు గాని తగులకూడదు.

ప్లాటినమ్‌కి మన భాషలో పర్యాయ పదం లేదు. ఇది వెండి వలె గంధకంతో కలిస్తే నల్లగా అవదు. దీనికి గల విశిష్ట లక్షణం గాజుతో సమంగా వ్యాకోచం చెందడం. అందుచేత గాజుతో ఇది అతుక్కుపోతుంది. ఈ కారణం చేతనే దీన్ని ఎలక్ట్రోడ్స్, సెల్స్ మొదలైన వాటిలో వాడుతున్నారు. దీనిలో ఇరిడియం కలిపితే దీనికి మరింత గట్టితనం వస్తుంది. ప్లాటినంలో 43 శాతం ఇనుము కలిపితే వచ్చే మిశ్రమ లోహానికి సంకోచ, వ్యాకోచాలు ఉండవు. 23 శాతం కోబాల్ట్ కలిపి స్థిరమైన అయస్కాంతాలు (permanent magnets) చేయడానికీ, 4 శాతం టంగ్‌స్టన్ కలిపి స్పార్క్‌ప్లగ్ ఎలక్ట్రోడ్‌లు మొదలైనవి తయారు చెయ్యడానికీ వాడుతున్నారు.

ప్లాటినమ్‌కి మిగతా రెండు లోహాలకన్న అధికమైన ఉష్ణవాహక శక్తి, విద్యుద్వాహక శక్తి ఉన్నాయి. ఈ లోహాన్ని కట్టుడు పళ్ళ ప్లేట్లకూ, సర్జికల్ పనిముట్లకూ, ఫొటోగ్రఫీ లోనూ ఎక్కువగా వాడుతున్నారు. వజ్రాన్ని గట్టిగా పట్టి ఉంచే శక్తి ఈ లోహా

## వేరుసెనగ గింజల వల్ల ప్రమాదం



లండన్‌లోని చారింగ్ క్రాస్ ఆసుపత్రికి చెందిన శిశు వైద్య నిపుణుడు డా. హ్యూజాలీ అభిప్రాయం ప్రకారం పిల్లలకు స్వీట్స్ బదులు వేరుసెనగ గింజలు (peanuts) ఇవ్వడం చాలా ప్రమాదకరం. ఒక్కొక్కప్పుడు పొరపాటున అవి ఊపిరి తిత్తులలోకి పోయి తీరని నష్టం కలిగిస్తాయి. చావుకి దారి తీసిన సందర్భాలు కూడా లేకపోలేదు. 1981 లో బ్రిటన్‌లో 600 మంది అలాంటి రోగులకు చికిత్స జరిగింది. వారిలో ఎక్కువ మంది పిల్లలు. అలాంటి ప్రమాదాల వల్ల అమెరికాలో ఏటా 2,000 మంది పిల్లలు మరణిస్తున్నారు.

"చాలా మందికి ఎప్పుడూ గుర్తుండేవి హక్కులు: తరచు మరచి పోయేవి బాధ్యతలు." —జవహర్‌లాల్ నెహ్రూ

నికి ఉంది. అందుకే వజ్రాల నగలకు ప్లాటినమ్ వాడుతారు. తరుగులేని లోహం అవడం చేత ఖరీదైనా దీన్ని నైట్రిక్ ఆసిడ్, సల్ఫ్యూరిక్ ఆసిడ్, ఫార్మాల్ డిహైడ్ పరిశ్రమలలో సహకారి (catalyst) గా ఉపయోగిస్తున్నారు. ప్లాటినమ్‌ను శుభ్రపరచాలంటే హైడ్రోక్లోరిక్ ఆసిడ్‌లోగాని, నైట్రిక్ ఆసిడ్‌లో గాని వేసి మరిగించి తరువాత మంచినీటితో కడగాలి. దీన్ని ఎప్పుడూ మంటమీద పెట్టకూడదు. మసి సోకితే ఇది దెబ్బ తింటుంది.

---

(16 వ పేజీ తరువాయి)

మచ్చలమీద పెట్టండి. అవి మటుమాయం అవుతాయి. ముఖానికి ఖర్చు లేని మంచి టానిక్ అడుసు మన్ను పట్టీ! దానివల్ల రక్త ప్రసారం ఎక్కువై ముఖం కలకల లాడుతుంది. మెడ కండరాలకూ, ముఖంలో కండరాలకూ వ్యాయామం కలిగించడం వల్ల కూడా ముఖంలో రక్త ప్రసారాన్ని పెంపొందించుకోవచ్చు!

శరీరంలో ఉండే జంతు భాస్వరం ప్రమాణాన్ని బట్టి కూడా చర్మం వన్నె ఏర్పడుతూ ఉంటుంది. సౌందర్య పోషకమైన అద్భుతమైన 'కాక్‌టెయిల్' పానీయం ఒకటి ఉంది. పచ్చి కాబేజీ రసం, గోపీపువ్వు రసం, కారట్ దుంపల రసం సమ పాళ్ళలో కలిపి రోజూ భోజనానికి అరగంట ముందు సేవించి చూడండి - వచ్చే మార్పు మీకే తెలుస్తుంది. ఏ రంగులూ వేసుకో నక్కర లేకుండానే సహజంగానే బుగ్గలు గులాబి మొగ్గలు అవుతాయి.

విలువైన లోహాల విశిష్ట ధర్మం అవి ఎన్నడూ తుప్పుపట్టక పోవడం. అందుకే విడి విడిగా గాని, ఇతర లోహాలతో కలిపి గాని వాటిని ఆభరణాలకు వాడుతున్నారు. మూలపదార్థా లన్నిటిలోనూ వీటి కొక ప్రత్యేక స్థానం లభించింది.

## బాల మెజీషియన్



ఉడుపి (కర్ణాటక) లోని మెజీషియన్ దంపతులు శ్రీ శంకర్, శ్రీమతి లక్ష్మి శంకర్‌ల కుమారుడు 4 ఏళ్ళ వయస్సు గల మాస్టర్ తేజస్వి ఇప్పుడు ప్రపంచం అంతటిలో మిక్కిలి చిన్న వయస్సు మెజీషియన్. 1982 లో కోయంబత్తూరులో జరిగిన అఖిల భారత మెజీషియన్‌ల మహాసభలో ఈ బాలుడు తన మొదటి ప్రముఖ ప్రదర్శన ఇచ్చాడు. ఆ ఏడాది జూలైలో హూస్టన్ (అమెరికా)లో జరిగిన అంతర్జాతీయ మెజీషియన్‌ల సభ సందర్భంలో ని. 20 ల ప్రదర్శన ఇచ్చాడు. ఇప్పటికి మొత్తం 116 ప్రదర్శనలు ఇచ్చాడు. వాటిలో 25 అమెరికాలో!

"ఆకలి వేసే వాడికి అన్నమే పరబ్రహ్మ!" —గాంధీజీ

12 డి. రవీంద్ర బాబు, 21 సం.లు, బి. టెక్. ఆఖరి సంవత్సరం, ఇంజనీరింగ్ హాస్టల్, 245, ఎస్.వి.యు.పి.ఇ. హాస్టల్, తిరుపతి-517 502.

పుస్తక పఠనం, మ్యూజిక్, ఫొటోగ్రఫీ.

13. గడిగట్ల వినోద్, 18 సం. లు, S/o గడిగట్ల జమీందార్, రాజాగారి వీథి, పెద్దాపురం-533 437.

కలం స్నేహం, పుస్తక పఠనం, చిత్ర లేఖనం.

14. కుపిరెడ్డి సింహా రెడ్డి, 22 సం.లు, ఫిట్టర్, ఇంటి నెం. 2-2-1105/8 తిలక్ నగర్, న్యూ నల్లకుంట, హైదరాబాద్-500 044.

(12 వ పేజీ తరువాయి)

ఇంట్లోని ఫాక్స్‌మిలీ యంత్రంలోనుంచి ఆ ఉత్తరం బయటికి వస్తుంది.

* * *

## మామూలు టెలిఫోన్ స్థానే వీడియో ఫోన్:

పశ్చిమ బెర్లిన్‌లోని 'హైన్రిఖ్ హెర్ట్జ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టీ.వీ. కమ్యూనికేషన్స్ టెక్నాలజీ'కి చెందిన శాస్త్రవేత్తల ఊహ ప్రకారం 1990 నాటికి ఇంచుమించు మామూలు టెలిఫోన్ ఖరీదుకే వీడియో టెలిఫోన్ అందుబాటులో ఉండడం జరుగవచ్చు. టెలిఫోన్ లైన్‌లకు రాగి తీగెలకు బదులు ఆప్టికల్ ఫైబర్ వాడుక చెయ్యడం ద్వారా సహజమైన సంభాషణకు అవకాశం ఇచ్చే వీడియో టెలిఫోన్ పద్ధతిని ప. జర్మనీలో ప్రస్తుతం ప్రవేశపెడుతున్నారు. ●

కవితలు వ్రాయడం, ప్రకృతి ఆరాధన, సినిమాలు చూడడం.

15 యం. శ్యాంసుందర రెడ్డి. 24 సం.లు, జూనియర్ సహాయకుడు, సహాయ వ్యవసాయ సంచాలక కార్యాలయం, విస్తరణ సి.ఏ.డి. పెద్దపల్లి-505 173, కరీంనగర్ జిల్లా.

కలం స్నేహం, రేడియో వినడం.

## కలకాలం చెరగిపోని పాట రికార్డు




'పోలీగ్రామ్' అనే సంస్థ తమ హనోవర్ (ప. జర్మనీ) ఫాక్టరీలో 'కాంపాక్ట్ డిస్క్-డిజిటల్ ఆడియో' అనే కొత్త రకం రికార్డులను రోజుకు 20,000 లెక్కను ఉత్పత్తి చేస్తూంది. 'ఈ కాంపాక్ట్ డిస్క్'లో విశేషం రికార్డ్ అయిన సంగీతాన్ని తిరిగి వినిపించడంలో ఉంది. ఒక లేసర్ కిరణం ప్లాస్టిక్ డిస్క్‌లోని రేఖలపై ప్రసరించి దాని మీది దృశ్య ప్రేరణలను ఎలెక్ట్రిక్ ప్రేరణలుగా మారుస్తుంది. ఈ రికార్డుకి పాడవడం అంటూ లేదు. ధూళి, గీతలు పడడం, వేలిముద్రలూ దానిని ఏమీ చెయ్యలేవు.

# పోటీలు

మార్చి 1984

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మార్చి **20, 1984**. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్‌డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'తిరునాళ, నాడు - నేడు' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. సుప్రీంకోర్ట్ జడ్జికి ఉద్యోగ విరమణ వయ స్సెంత? 2. సూర్యునికి మిక్కిలి దగ్గి

## యూరప్‌లో మంచు స్కేటింగ్ ఛాంపియన్



22 ఏళ్ళ సైనికుడు నార్బర్ట్ శ్రామ్ దోర్ద్‌మండ్ (ప. జర్మని)లోని వెస్ట్ పాలెన్ హాలెలో జరిగిన స్కేటింగ్ పోటీలలో అత్యధికమైన స్కోరు సాధించి యూరప్ కంతటికీ ఛాంపియన్ కిరీటం గెలుచు కున్నాడు.

'ప్రేమే దేవుడు: ప్రేమలో జీవించే వారు దేవునిలో జీవిస్తున్నారు -న్యూ టెస్టమెంట్

రగా ఉన్న గ్రహం ఏది? 3. ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాల మధ్య ఉన్న మహాసముద్రం ఏది? 4. ఇండియాలో బొగ్గు గనులు ఉన్న రెండు ప్రధాన కేంద్రాలు ఏవి? 5. ప్రపంచంలో నూలు వస్త్రాల ఉత్పత్తిలో అగ్రస్థానంలో ఉన్న దేశం ఏది? 6. 9 వ ఆసియా క్రీడోత్సవాలలో పాల్గొన్న ఇండియన్ హాకీ టీమ్‌కి కెప్టెన్ ఎవరు? 7. బ్రెజ్నేవ్ మరణానంతరం రష్యన్ కమ్యూనిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శి ఎవరు? 8. కంచు ఏ ఏ లోహాల మిశ్రమం?

## పజిల్

ఆధారాలు-అడ్డం: 1. 'శాస్త్రి' తీసేసి 'శ్రీ' ధరించిన పావని శాస్త్రి, 3. సామాన్లు పెట్టుకునే బెంచీ లాంటి వెనుకటి పరికరం, 5. కృష్ణుని మీద వ్రాసిన 8 శ్లోకాల పుస్తకము, 8. పాఠకుడు, 9. ఒక ఇంటి పేరు, 10. తగిన వయస్సు, 11. గోడగ, 12. సరళా దేశం పొందిన పతాక, 13. ముసలి కోరిక, 16. శ్రీకృష్ణ తులాభారం వ్రాసిన కవి ఇంటి పేరు, 17. తుమ్మెదలు ఏ మనేవి?

నిలువు: 1. శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు వ్రాసిన రామకథతో కూడిన రంగస్థల నాటకము, 2. శ్రీమంతుడైన కృష్ణుణ్ణి సంబోధించండి. 3. పచ్చగడ్డి, 4. తిరుపతి వేంకట కవులలో రెండోకవి పూర్తి పేరు, 5. నాలుగు యుగాలలో మొదటిది,



6. అనాది అయిన 'అష్టమి వరకో', 7. గజిబిజి అయిన 'కరాము బస్సు', 14. రాక్షసు, 15. మామూలు.

## పాఠకుల అభిప్రాయాలు



"మమతలే ఉంటే
మన మధ్య మతాలు దండగ!"
—యం. లక్ష్మీనారాయణ,
అక్కుపల్లి పోస్టు.

* * *

"అసత్యానికి నోరు పెద్దది:
సత్యానికి గుండె గట్టిది-జయిస్తుంది!"
—వై. భాగ్యరేఖ, ధర్మవరం.

* * *

"ధనం ఈ లోకాన్ని నడిపించే
ఇంధనం!"
—కె. విజయ శ్రీధర్‌బాబు, అనంతపురం.

"ప్రేమ ఎప్పుడూ మూల్యం కోరదు; తనని తను అర్పించుకుంటుంది: బాధలోనే పునీత మవుతుంది. వేదనలకు జంకదు-ప్రతీకారం కోరదు" —గాంధీ

## తెలివికి పరీక్ష

1. ఆర్థిక, చారిత్రక, మత విషయిక, ఆంగిక, సాంస్కృతిక, రాజకీయ—ఈ వర్గంలో అతకని మాట ఏది? 2. ఆగారము, వెలిగారము, భాండారము, బండారము, నయ గారము—వీటిలో ఒక అక్షరం లోపించిన పదం కనుక్కోండి. 3. శ్వేత, పవిత్ర, పుణ్య, శుభ్ర, అకలుష—వీటిలో 'మురికి'కి వ్యతిరేక పదంఏది? 4. పక్షి→చేప, విమానం→? (పడవ, జలాంతర్గామి, ఓడ, తిమింగిలం) 5. పురుషుడు, స్త్రీ ప్రాణ మిత్రులు కాలేరు - నిజమా? కాదా? 7. వృక్షశాస్త్రజ్ఞుడు→చెట్టు, సాంఘిక శాస్త్రజ్ఞుడు→? (స్త్రీలు, సంఘం, మతం, రాజకీయాలు); 8. చావు, దశాహం, సదస్యం, ఆదరింపు, శోకం—ఈ వర్గంలో ఇముడని మాట ఏది?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. అంకిలి: (ఏ) వంకర, (బి) దౌడ కింది కీలు, (సి) సంఖ్య, (డి) ఆపద.

2. అంకురము: (ఏ) శిశువు, (బి) గడ్డి, (సి) మొలక, (డి) విత్తనము.

3. అంగ: (ఏ) అవయవం, (బి) పెద్ద అడుగు, (సి) చొక్కా, (డి) దేహం.

4. అంగరకా: (ఏ) ఒక చెట్టు, (బి) చొక్కా, (సి) అవయవ విశేషం, (డి) స్తన వల్కలం.

5. అంగారము: (ఏ) బంగారం, (బి) వెండి, (సి) నిప్పు, (డి) బొగ్గు.

6. అంగుల (ళ) ము: (ఏ) అడుగు, (బి) వ్రేలు, (సి) పాదరక్ష, (డి) అడుగులో 12వ భాగం.

7. అంఘ్రి: (ఏ) పాదము, (బి) శూద్రుడు, (సి) చెట్టు వేరు, (డి) కాలి బొటన వ్రేలు.

8. అంజలి: (ఏ) తామర పువ్వు, (బి) హనుమంతుని తల్లి, (సి) కైమోడ్పు, (డి) ఒక తెలుగు సినీతార.

విస్డమ్

పోటీల కూపను

మార్చి 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

★

"ఇప్పుడు ఇద్దరమే!
మూడో ఏడాది
ముగ్గురం వస్తాం!"
—మట్టా అప్పలస్వామి, దేవాది పోస్టు

* * *

"అమ్మాయిలూ! మీ రెంత అలంకరించు
కొన్నా పరకట్నం తప్పదు!"
—కే. గోపాలకృష్ణ, పాలవంచ

* * *

"వేషాలు మాత్రమే ఒక్క తీరు
రూపాలు ఇద్దరివీ వేరు వేరు!"
—కె. అనసూయ, హైదరాబాదు

"విడదీసే ప్రతిదీ చెడ్డదే; ఏకంచేసే ప్రతిదీ మంచిదే!" —జవహర్ లాల్ నెహ్రూ

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి, రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి!

## మీరైతే...?

"ఇండియా ప్రధాని అయితే?"

మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

(8 వ పేజీ తరువాయి)

బలం క్రమంగా క్షీణిస్తూ వచ్చే ఆ కథలు ప్రబల నిదర్శనాలు.

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ అన్న ఈ క్రింది మాటలు నిజానికి ప్రతి వ్యక్తి హృదయంలోనూ మెదిలేవే: "యుద్ధం చెయ్యడానికే నేను పుట్టాను. ఈ జీవితం ఒక యుద్ధ రంగం పలాయనానికి ఇక్కడ స్థానం లేదు. జీవించడానికి చెల్లించవలసిన మూల్యం 'కృషి' (effort). భౌతిక స్థాయిలో సంఘర్షణ, కృషి ఆగిపోయిన మరుక్షణం నుంచీ ఎవరూ నిండుగా జీవించ గలగడం అసంభవం!"

## థీమ్




8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## 'డిగ్రీ' కాఫీ

తమిళనాడులో ఎక్కువగా వాడే ఈ మాట 30, 40 ఏళ్ళ క్రితం తంజావూరు, తిరుచ్చి జిల్లాలలో పాల చిక్కదనం పరీక్ష చేయడానికి 'లాక్టో మీటర్' వాడుక చేసే రోజులలో పుట్టింది. ఎక్కువ డిగ్రీలో చిక్కదనం ఉన్న పాలతో చేసిన కాఫీట-'డిగ్రీ కాఫీ' అంటే!

# జాతీయ వార్తలు

## చెరకు పిప్పిని వాడే మొదటి న్యూస్ ప్రింట్ ఫాక్టరీ:

తమిళనాడు ప్రభుత్వం తిరుచిరాపల్లి జిల్లా పుగలూరులో రూ. 200 కోట్ల వ్యయంతో నెలకొల్పనున్న న్యూస్‌ప్రింట్ ఫాక్టరీ మొట్ట మొదటిసారిగా మన దేశంలో చెరకుపిప్పి (bagasse)ని ముడి సరకుగా వాడుక చేస్తుంది.

* * *

## ఓడమీదనుంచి రేవుకు ఎలెక్ట్రానిక్ టెలిఫోన్:

బెంగుళూరులోని "ది ఇండియన్ టెలి ఫోన్ ఇండస్ట్రీస్" తీర సమీపంలో లంగరు వేసి ఉన్న ఓడమీద నుంచి రేవుపట్టణంలోని వారితో మాట్లాడడానికి వీలైన 'నెపాక్స్ - 100' (NEPAX - 100) అనే ఎలెక్ట్రానిక్ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ ఒకటి తయారు చేసింది. లంగరు వేసి ఉన్న ఓడ మీది 100 మంది సబ్‌స్క్రైబర్ లకు రేవు పట్టణంలోని టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లతో దీనివల్ల కనెక్షన్ లభించగలదు.

* * *

## మరో ఆరు ఎరువుల ఫాక్టరీలు:

మొత్తం రూ. 5,600 కోట్ల వ్యయంతో మరో ఆరు ఎరువుల ఫాక్టరీలు మన దేశంలో నిర్మించబోతున్నారు. మధ్య ప్రదేశ్‌లోని గుణా, రాజస్థాన్‌లోని సవాయ్ మధోపూర్, ఉ. ప్రదేశ్‌లోని అవోన్‌లా, బాబ్రాలా, షహ జహాన్‌పూర్, జగదీశ్ పూర్‌లలో నిర్మించ నున్న ఈ 6 ఫాక్టరీలూ కలపి రోజుకి 8,100 టన్నుల అమ్మోనియాను ఉత్పత్తి చేయ గలవు. ప్రస్తుతం ప్రభుత్వ రంగంలో 28, ప్రజారంగంలో 15, సహకార రంగంలో 3 ఎరువుల ఫాక్టరీలు దేశంలో పనిచేస్తున్నాయి.

## పెద్ద ఓడ రేవులలో రవాణా పెరుగుదల



పెద్ద ఓడ రేవులలో 1980-81లో సరు కుల రవాణా 813.1 కోట్ల టన్నులు కాగా, 1981-82లో అది 874.1 కోట్ల టన్నులకు పెరిగింది. 1982-83 ఇదివరకెన్నడూ ఎరు గని స్థాయికి పెరిగి 961.1 కోట్ల టన్నులు అయింది.

"మనిషి ఎప్పుడూ తనలోని భావాలకు ప్రతిరూపం" —గాంధీ

## భువనేశ్వర్‌లో రైల్వే వర్క్ షాప్:

రూ. 18 కోట్ల వ్యయంతో రైల్వే పెట్టెలకు మరమ్మత్తులు చేసే వర్క్ షాప్ ఒకటి భువనేశ్వర్ (ఒరిస్సా) లోని మాంచటర్ వద్ద నిర్మిస్తున్నారు. ఇండియాలో ఇంతకు ముందు ఇలాంటి వర్క్ షాప్‌లు రెండే ఉన్నాయి. ఒకటి: ప. బెంగాల్‌లోని ఖరగ్‌పూర్‌లోనూ, మరోటి: మధ్య ప్రదేశ్‌లోని బిలాస్‌పూర్.

## మధ్యప్రదేశ్‌లో సున్నపురాయి:

మధ్యప్రదేశ్‌లో ఖనిజాలకోసం తీవ్ర పరిశోధనలు జరుపుతున్న 'భూగర్భ శాస్త్రం గనుల త్రవ్వకం' శాఖవారు 6 జిల్లాలలో 14.80 కోట్ల టన్నుల సున్నపు రాయి లభించే గనులు ఉన్నట్టు కనుగొన్నారు.

## 44,209 హెక్టేర్లలలో అడవుల పెంపకం:

ఎడారి ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమం క్రింద ఇప్పటికి దేశంలోని 18 జిల్లాలలో 44,209 హెక్టేర్లలలో అడవులు నాటారు. రాజస్థాన్‌లో 11 జిల్లాలలోనూ, హర్యానాలో 4 జిల్లాలలోనూ, గుజరాత్‌లో 3 జిల్లాలలోనూ మాత్రమే కాక, చలి ఎడారి ప్రాంతంగా ఉన్న 'జమ్మూ-కాశ్మీర్' రాష్ట్రంలో 2 జిల్లాలలోనూ, హిమాచల్ ప్రదేశ్‌లో ఒక జిల్లాలోనూ కూడా ఈ కార్యక్రమం కొనసాగిస్తున్నారు.

* *

## వైద్యంలో పరమాణుశక్తి ఉపయోగాలు:

'అటమిక్ ఎనర్జీ కమీషన్' ఛైర్మన్ డా॥ హోమీ సెత్నా అభిప్రాయం ప్రకారం వర్ధమాన దేశాలలో వైద్య రంగంలో పరమాణు శక్తి కీలక పాత్ర నిర్వర్తించగలదు. దీని వాడకం వల్ల రోగి ఆసుపత్రిలో ఉండవలసిన రోజులను తగ్గించవచ్చు. రోగ నిదానంలోనూ, చికిత్సలోనూ కూడా పరమాణుశక్తి వాడకం

(మిగతా 64 వ పేజీలో)

## ఇండియాలో పల్లెలకు వరప్రసాదం బయోగాస్



18 కోట్ల పశువులూ, 6.1 కోట్ల బర్రెలూ ఉన్న ఇండియా ఈ విషయంలో ప్రపంచంలో ప్రథమ స్థానంలో ఉంది. సగటున అవి ఏటా 30/40 కోట్ల టన్నుల పేడ వేస్తాయి. ఈ పేడ అంతటినీ సద్వినియోగం చేస్తే 7,000 కోట్ల ఘ. మీటర్ల బయోగాస్ ఉత్పత్తి చేయవచ్చు. ఇందువల్ల 16 కోట్ల టన్నుల వంట చెరకు ఆదా అవుతుంది.

"అసంభవాన్ని సాధించాలనుకున్నప్పుడే దేవుడు మనకు గుర్తువస్తాడు."—ఆల్‌బర్ట్ కామూ

# పోటీలు (ఫలితాలు)

(జనవరి 1984)

వ్యాసం: మొదటి బహుమతి: వారణాశి పాపయ్యశాస్త్రి, అయ్యా కోనేరు దక్షిణగట్టు, విజయనగరం; రెండవ బహుమతి: పి. ఆర్. మందేశ్వర రావు, సికిందరాబాదు: మూడవ బహుమతి: ఆర్. జయకుమార్, చిత్తూరు.

క్విజ్ - జవాబులు: 1. అక్కడ త్రివేణీ సంగమం జరుగుతూంది. 2. జయ వర్ధనె, 3. హిమాచల్ ప్రదేశ్, 4. సూర్యుని ప్రకాశం వల్ల పగలు నక్షత్రాలు కని పించవు, 5. ఇది వేద నిఘంటువు - వేదాం గాలు ఆరింటిలో ఒకటి, 6. వై.బి. చవాన్, 7. తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతంలో కలిసేవి నదులు. పడమరగా ప్రవహించి అరే బియా సముద్రంలో కలిసేవి నదములు, (నర్మద, తపతి నదములు), 8. మేడమ్ క్యూరీ 'రేడియమ్' కనిపెట్టింది.

విజేతలు - మొదటి బహుమతి: పి. ఈశ్వరరావు. గంగాడా: రెండవ బహుమతి: యస్ అబ్దుల్ హక్, కడప; మూడవ బహుమతి: వారణాశి రామచంద్ర గోపాల్, పార్వతీపురం.

పజిల్ - జవాబులు - అడ్డం: 1. మదరాసు నగరము, 8. ద, య, మా, 9. గజ నిమ్మ, 10. రానీయకుము, 11. భరణి, 12. సు. యు. తి., 14. పైపై ప్రమ, 15. హాయిగా, 17. వగల మారులు, 20. నలి, 21. చదలంటి, 22. 'వున', 24. 'తికి' 25. కవాకటం, 27. మునుక, 28. ముసురులో.

నిలువు: 1. మదరాసు, 2. దయ నీయులు గద:, 3.రామాయతి. 4 నగముపై, 5. గజ, 6. ర, ని, ఫ, ప్ర, హా. 7. ముమ్మర మయిన, 14. ఈ మాటికి, 16. గాలిపటం, 17. వచనము, 18. లలంతిక, 19. లు, వు, క, సు 23. నవారు, 24. కలో:

విజేతలు: మొదటి బహుమతి: కె. వి. ఎస్. రామలింగరాజు, గుంటూరు: రెండవ బహుమతి: వి. యం. సుధాకర రెడ్డి. ప్రొద్దుటూరు, మూడవ బహుమతి: కె. నర్సింగ్ రావు. నిజామాబాదు.

తెలివికి పరీక్ష: - జవాబులు: 1.

---

## ప్రొ. నాయుడమ్మకు 'రాజా - లక్ష్మి' అవార్డు

ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ శాస్త్ర విష యిక సలహాదారుగా ఉన్న శ్రీ వై. నాయు డమ్మకు గత నవంబరు 19న హైద్రాబాద్‌లో జరిగిన సదస్సులో 1983 'రాజా-లక్ష్మి' అవార్డును అందజేశారు. రూ. 10,000 లకు ఒక చెక్, ప్రశంసా పత్రం ఆయనకు సమ ర్పించారు.

---

"అన్ని మతాలూ ఒకే కేంద్రకం వద్దకు తీసుకువెళ్తాయి. అంచేత ఏ దారిని వెళ్ళినా చేరుకోవలసింది ఒకే చోటుకే" —

'ద' ('ద' తరువాతనే గద 'ధ' 'న' వర్ణాలు వచ్చేది, 2. రక్తాక్షి, 3. రెండు కొండల మధ్య దారి, 4. వర్షము, 5. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు, 6. 67, 83: 7. 'నటి' (ఇది 'వి' కారాంతం కాదు), 8. తండ్రి 29, తల్లి 26, కొడుకు 4, కూతురు 1 ఏడాది.

విజేతలు - మొదటి బహుమతి : పి. ఈశ్వరరావు, గంగాడ: రెండవ బహుమతి: టి. ధనంజయ రావు, పిరికొండ; మూడవ బహుమతి: జి. రమేష్, హైదరాబాద్.

మాటల మహిమ - జవాబులు: 1. సేద్యము (బి), ప్రయత్నం (డి), 2. ఒక నది (ఏ) ద్రౌపది (సి), 3. అగ్ని (బి), రాహువు (డి), 4. కత్తి (బి), 5. చేసిన మేలు మరచినవాడు (సి), 6. చర్మము (బి), చెట్టుపై పట్టు (డి), 7. సింహము (బి), ఒక వానరుడు(డి), 8. వరిమడి(బి), కొండ(సి).

విజేతలు: మొదటి బహుమతి: ... ముద్దుకృష్ణ, అన్నవరం, కృష్ణాజిల్లా; రెండవ బహుమతి. బి. కల్యాణ్. వరంగల్: మూడవ బహుమతి: ఎస్. చంద్రశేఖర్, నెల్లూరు-2.

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహుమతి: మట్టా అప్పలస్వామి, దేవాది, శ్రీకాకుళం జిల్లా; రెండవ బహుమతి: కె. గోపాలకృష్ణ. పాలవంచ, ఖమ్మం జిల్లా; మూడవ బహుమతి: కె. అనసూయ, హైదరాబాదు.

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: యం. లక్ష్మీనారాయణ, అక్కపల్లి; రెండవ బహుమతి: వై. భాగ్యరేఖ. ధర్మవరం; మూడవ బహుమతి: కె. విజయ శ్రీధర్ బాబు, అనంతపురం.

మీరైతే? - మొదటి బహుమతి: జి. బాబురావు, వడిశలేరు; రెండవ బహుమతి: మట్టా అప్పలస్వామి, దేవాది, శ్రీకాకుళం జిల్లా; మూడవ బహుమతి: ఆర్. సత్యనారాయణ, సూరప్పగూడెం.

భావపరిచయపోటీ: మొదటిబహుమతి: ఎన్. బోసు, కలకోట; రెండవ బహుమతి: బి.ఎస్. చార్లు, కర్నూలు; మూడవ బహుమతి: కె. విజయ శ్రీధర్ బాబు, అనంతపురం.

(62 వ పేజీ తరువాయి)

వల్ల వెనుకటి స్టెతస్కోప్ మొదలైన పరికరాలు మూలపడుతున్నాయి.

* * *

## విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో రికార్డు:

ఉ. ప్రదేశ్ రాష్ట్రంలోని సింగ్రౌలీ సూపర్ థెర్మల్ విద్యుత్ కేంద్రంలోని ఒక 200 మెగావాట్ల యూనిట్ 98.68 శాతం విద్యుత్తును ఉత్పత్తి చేసి, మన దేశంలో కొత్త రికార్డు నెలకొల్పింది.

## వెనుకటి రాణి భవనానికి మరమ్మతులు:

కర్ణాటక రాష్ట్రంలో బ్రిటిష్‌వారిని ధైర్యంగా ఎదిరించి పోరాడిన రాణీ కిట్టూర్ చెన్నమ్మ జన్మించిన భవనాన్ని త్వరలో పునరుద్ధరించ నున్నారు. బెల్గాం తాలూకాలోని 'కాకతి' అనే గ్రామంలో ఉన్న ఈ భవనం ప్రస్తుతం శిథిలావస్థలో ఉంది.

